

"తోడూ-నీడా" లో భానుమతి

స్టూడియో శ్రీసారథి • శ్రీసినిలింక్ విడుదల

కూతురు పెళ్ళికోసం దొంగతనం
చేశాడు నరసరాజు: దాని వల్ల
మరో చోట పీటల మీద
పెళ్ళి ఆగిపోయింది - ఇటు
తన బిడ్డ కూడా సుఖపడలేదు.
చివరకు ఆమె కాపురం
చక్కబెట్టిందెవరు?



ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన తొలి తెలుగు సాంఘిక చిత్రం
అంతా కొత్తవారితో నటించిన సంచలన చిత్రం
బాబూ మూవీస్ వారు సగర్వంగా సమర్పించు

# తేనె మనసులు

దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు   నిర్మాత సి. సుందరం
కోడైరెక్షన్ - కె. విశ్వనాథ్ • సంగీతం మహదేవన్

రామ్మోహన్

జి.ఎస్.ఆర్ మూర్తి

సంధ్యా రాణి

# ఉత్తరాలు

## ముఖచిత్రం

ఎప్పుడూ సినిమా తారలనే ముఖచిత్రాలుగా చూచి చూచి విసుగెత్తి పోయిన మాకు క్రిందటి వారం ముఖచిత్రం కొంత 'రిలీఫ్' ఇచ్చింది: కొత్తదనం ఉంది కాబట్టి. మీరు ఆలోచించే వేసారో, లేక పోతే అనుకోకుండానే జరిగిపోయిందో తెలియదు గాని, ముఖచిత్రం మీద "ఓడి పోయాను" అన్న ప్రకటన, దానికి తగినట్టుగానే ఓడిపోయినట్టు దిగాలుపడి కూర్చున్న బి. సరోజాదేవి ఫోటో, చక్కగా కుదిరినాయి. ఇకముందు కూడా సాధ్యం అయినంతవరకు లోపలి కథలకు అను గుణంగా ఉన్న ముఖచిత్రాలను (సినిమా తారలవైనా సరే) వేస్తారని ఆశించవచ్చునా?

విన్ని. (కాకినాడ)

మీ యిష్టం!

## వ్యాసాలు

ఈ వారం మీరు ప్రచురించిన కాంబోడియా మీది సచిత్రవ్యాసం నాకెంతో నచ్చింది. ఇదివరకు మానిన వెరైటి శీర్షికలను ప్రవేశపెట్టదలచుకుంటే ఇలాంటి, నలుగురికి పనికొచ్చే విషయాల్ని సేకరించి, "పత్రిక" లో వేస్తే చాలామంది ఆనందిస్తారు.

హెచ్. యస్. యస్. పిళ్ళె. (బరంపురం)

## భాషా సమస్య

ఇప్పటికైనను ప్రభుత్వమువారు బాగా ఆలోచించి మరల ఇంగ్లీష్ భాషనే అధికార భాషగా ప్రవేశపెట్టినట్టయితే హిందీ వ్యతిరేకోద్యమములు విరమించగలరని ప్రభుత్వమువారికి విన్నవించుకొనుచున్నాము.

కె. గురుప్రసాద్ (మ్యాట్రిక్ సెక్రటరీ) (హిందూపురం)

* * *

మన కేంద్రప్రభుత్వమువారు హిందీని బలవంతముగా రుద్దమని అంటూనే పోస్టాఫీసులో హిందీని 'కంపల్సరీ' చేశారు. మైలురాళ్ళ మీద తెలుగును తీసివేసి హిందీని మాత్రమే పెడుతున్నారు. ఆఖరికి పల్లెటూళ్ళ బోర్డుల మీద కూడ హిందీ అక్షరాలే!

మనకు హిందీ వద్దని శాంతియుతంగా పోరాటం చేయవచ్చునుగాని, జన, ధన నష్టానికి మూలమయ్యే ఏ చర్యనైనా గర్హిస్తాము.

వై. డి. పి. రావు. (వాల్తేరు)

## సినిమా

"చిత్రలహరి" శీర్షికలో ఒక ఫోటో క్రింద ఒక స్థానిక సేవాసంస్థ సహాయార్థం మద్రాసులోని తారలు క్రికెట్ ఆడారు అని రాసేరు. కాని ఫోటోలో తారలు చేతిలో హాకీ బ్యాట్లు ఉన్నవి. బహుశ తారలు హాకీ బ్యాట్లతో క్రికెట్ ఆడి ఉంటారేమో?

"జగం." (ఖర్గపూర్)

మా సంపాదక వర్గంలో క్రికెట్, హాకీలు వేరే ఆటలనే సంగతి మర్చిపోవటం జరిగింది.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 12–3–'65
క్రోధినామ సం|| ఫాల్గుణ మాస శు|| నవమి
సంపుటము : 57 సంచిక ; 28

స్థాపితము:
1908

*

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

*


## ఒక సంవత్సరం చందా వివరాలు


ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00; అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

| | |
|---|---|
| విడిప్రతి | 30 పై. |
| సంవత్సర చందా | 15.60 పై. |
| 6 మాసాల చందా | 7.80 పై. |

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"మమ్మల్ని నిందించి ప్రయోజనం లేదు. రేపు మీరు మంత్రిగారయినా మీరు చెప్పినట్టు చెయ్యాల్సిందే."

## మనలో మాట

మామూలు కథలు, సీరియల్ కథలతో బాటు ప్రత్యేకమైన సచిత్ర వ్యాసాలు, యదార్థ గాథలు తరచుగా అందిస్తూనే వున్నాము. 6 వ పేజీలో ప్రారంభమయే 'పోర్టర్ భగవంతం' కథను షుమారు ఆరువారాల క్రితమే మా 'రిపోర్టర్' సేకరించారు...

* * *

సకాలానికి అందనందున యీ వారం న్యూఢిల్లీ లేఖ వెయ్యలేకపోతున్నాము.

* * *

ఈ సంచికలో వేసిన 'ఫేర్ వెల్ టు మై ఫ్రెండ్' కథా రచయిత్రి ప్రస్తుతం 'ఆక్స్‌ఫర్డ్' లో వుంటున్నారు.

* * *

"వేల్పులకైనా మార్పులు తప్పవు" శీర్షికలో విష్ణువును గురించిన రెండవ వ్యాసం యీ వారం వేశాము. దీనితోబాటు వేసిన శ్రీకృష్ణుని బొమ్మ ఒక ఆధునిక శిల్పానికి అనుసరణ. వచ్చేవారం విష్ణువుకి సంబంధించిన మరికొన్ని విశేషాలు...

* * *

శనికి దేవాలయం వుండటం విచిత్రమే కావచ్చు. ఆ విశేషాన్ని 28, 29 పేజీలలో సచిత్రంగా చూడవచ్చు.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి రాజశ్రీ (ఫొటో: ప్రభాకర్)

కథనం: వాశిరాజు ప్రకాశం || ఫొటోలు: ప్రభాకర్

# పోర్టరు భగవంతం కథ

**చిన్ననాటనే తల్లికి, తండ్రికీ దూరమయి, వ్యక్తిగా జీవిస్తూ గంపెడు సంసారాన్ని యీదుతూ జీవయాత్ర చేస్తున్న సామాన్యుని సచిత్రగాథ: పోర్టర్ల సమస్యలూ!**



అతని జీవితంలో బరువు భారాలు ఎప్పుడూ వుంటాయి.

కళ్ళు చమర్చినయ్. రెండు కళ్ళలోనుంచి అశ్రువులు జలజలా రాలాయి. నా వైపు అతను మళ్లీ తేరిపార చూచాడు: "ఇదంతా పేదవాళ్ల కథలే బాబూ! ఎందుకు మళ్లీ మళ్లీ చెప్పుకొనటం. కూటికొస్తుందా? గుడ్డకొస్తుందా?" అన్నాడు నిరాశా, నిస్పృహలను వ్యక్తం చేస్తూ!

అతన్ని చూస్తుంటే జాలివేసింది. పాపం ఎంత బాధతో తన కథ అంతా చెప్పుకొన్నాడో! అతను చెప్తుంటే మధ్య మధ్య దుఃఖంతో గొంతు పూడిపోయి, మాటలు సరిగా వచ్చేవి కావు. ఎంతో బాధతోను, తన బాధను మరొకరికి చెప్తే కొంతయిన బాధా నివృత్తి అవుతుందన్న సంతోషంతోను తన కథనంతా చెప్పాడతను.

పండు ముసలివాడు. ఇవ్వాళో రేపో మంచాన పడే స్థితిలో ఉన్నాడు. ఎప్పుడు రాలిపోతాడో?

జీవితాలు ఎక్కడ మొదలవుతాయో, ఎక్కడ ముగుస్తాయో! అసలు ఈ జీవితానికి అర్థం ఏమిటో......!

* * *

పోర్టర్ భగవంతం కథ ఎంతో చిత్రమైనది. జీవితంలో వెలుగు నీడలను చూచినవాడు. కష్ట సుఖాలను సమంగా సమ్మేళనంచేసి తన ఆస్తిగా చేసికొన్నాడు. తన చుట్టూ నడిచే తనలాంటి ప్రజల భారాన్ని అందరిలో తానొక్కడై భరించాడు. మంచి వాళ్లనడుమ 'మంచి' అనిపించుకొన్నాడు. పొగరుమోతులచేత మాట పడ్డాడు. తనపనికి ప్రతిఫలంగా నాలుగు డబ్బు లిచ్చిన మనిషిని చూచి "మా బాబు మంచోడు" అనుకొన్నాడు, కసురు కొన్న పెద్ద మనిషిని చూచి 'ఈ తరహా ఇంతే కాబోలు" ననుకొన్నాడు. ఇదీ అతని జీవితపు వైఖరి.

భగవంతం ఈనాటివాడు కాదు: రెండవ ప్రపంచయుద్ధం రాక పూర్వమే అతను జీవితంతో సమరం ఆరంభించాడు. ఇరవైయ్యో శతాబ్దం ప్రారంభం అయిన కొత్తల్లో భూమీదకు వచ్చాడు. అతని వయస్సు షుమారు 60 సంవత్సరాలుంటాయి.

"ఏమయ్యా భగవంతం! ఎప్పుడు పుట్టావు" అని అడిగాం.

"ఆ లెక్కంతా మా బాబుకు తెలుసు. ఆయన ఎప్పుడో సచ్చిపోయినాడు" అన్నాడు భగవంతం. అదీ నిజమే! ఆరోజుల్లో ముఖ్యంగా భగవంతం లాంటి మనుషుల పుట్టు పుర్వోత్తరాలను పదిల పరచే అవకాశా లెక్కడివి?

భగవంతం జీవితంలోని 60 సంవత్సరాలు కనీసం 60 రకాల చరిత్ర గ్రంధాలుగా తయారవుతాయి. పేదవాని జీవితాన్ని చూచి నవ్వి,

# మద్రాసు సెంట్రల్ లోవున్న 424 మంది పోర్టర్లలో అతనూ ఒకడు!

# రెండవ ప్రపంచయుద్ధానికి ముందే జీవిత సమరం ప్రారంభించాడు!!

# అందరితోపాటు తాను జీవించాలి అదే అతని లక్ష్యమూ, ఆశయమూ!!!



సెంట్రల్ లో వుండే 424 పోర్టర్లలో ఒక మేస్త్రీ.

ఆ నవ్వులోనుంచి ఆనందాన్ని అనుభవించేవారికి భగవంతం కథ ఎంతో బావుంటుంది. కాని, ఇతరుల కష్టాలను చూచి చలించే సహృదయులకు ఇతనిగాథ ఆపాదమస్తకం కంపింపచేస్తుంది.

భగవంతం ఈ లోకంలో పడ్డాడు. నిజమే! కాని, అందరిలాగా అతనికే దిక్కు దొరకలేదు. పాలిచ్చి, పెంచి పెద్దచేసే అమ్మ కరువయింది. మంచీ, చెడూ విచారించే తండ్రి ఎక్కువ రోజులు అతనితో లేడు! భగవంతం కన్ను తెరుస్తుండగానే, అతని విధి కూడా మూడవ కన్ను తెరచి, భగవంతం తల్లిని అతనికి దూరం చేసింది. భగవంతం అక్షరం ముక్కలయినా నేర్చుకోక ముందే తండ్రి ఎక్కడికో పోయాడు!

"మరి మీనాన్న ఎక్కడికి వెళ్ళాడు, భగవంతం?" అని అడిగాను.

"ఎక్కడికి ? ఏం చెప్పను? ఒకనాడు మా బాబు బజారు కెళ్ళాడు. ఆ రోజులు తెల్ల దొరల రోజులు. తెల్ల దొరలను ఎదిరించేడన్న నేరంతో ఆయన్ని జైలులో పెట్టారు. ఆ తరువాత నా ముఖం ఆయన చూడలేదు. ఆయన ముఖం నేను చూడలేదు" అన్నాడు భగవంతం. ఇదంతా ఇరుగు, పొరుగు చెప్పగా విన్నాడట అతను.

అప్పటినుంచే భగవంతానికి కొత్త జీవితం ప్రారంభమయింది. ఏవైపు చూచినా అయోమయం. అంతా అగమ్యం. పసివాడాయె! ఏం తెలుస్తుంది? ఆలన, పాలన చేసేందుకు తల్లిగాని, తండ్రిగాని లేరు. తన జీవితానికి సంబంధించినంతవరకు తానొక్కడు. తనకేం వచ్చినా చూచేందుకు, తన బాగోగులు విచారించేందుకు 'నా' అన్న వాళ్ళెవ్వరూ లేరు. అలాంటి స్థితిలో అతని జీవితం ఆరంభమయింది. చూచిన వాళ్ళంతా ప్రారంభమూ, ముగింపూ కూడా అదేననుకొన్నారు.

కాని అలా జరగలేదు. అతని జీవితంలో ఆరోజే నవ శకం ఆరంభమయింది. అంతకాలంగా తన తల్లికీ, తండ్రికీ తోడు నీడగాఉన్న ముసలమ్మ ఒకామె అతన్ని దగ్గరతీసి పెంచింది.

అలా నాలుగేళ్ళు గడిచాయి. అతనికి అక్షరం ముక్కలు తెలిశాయి. హైస్కూల్లో చేరే సమయానికి మరో సమస్య ఎదురయింది. తల్లీ, తండ్రీ తరువాత అంతటిదయిన ముసలవ్వను కూడా భగవంతుడు తన దరి చేర్చుకొని భగవంతాన్ని మరో పరీక్షకు గురి చేశాడు! ఆ నాటినుంచి నేటివరకూ ఐదు దశాబ్దాలుగడిచాయి. ఎండలో ఎండిపోయాడు. వానలో తడిసిపోయాడు. చలిలో వణికిపోయాడు. ఉన్నరోజు తిన్నాడు. లేనిరోజు నీళ్ళుతాగి తృప్తిపొందాడు. అలానే రోజులు గడుస్తున్నకొద్దీ పెరిగి పెద్దవాడయ్యాడు. రైలుస్టేషన్లో ఆ అయ్యనూ, యీ అమ్మనూ బతిమాలుకొని కూలీపని చేస్తుండేవాడు. నాలుగుడబ్బు లొచ్చినరోజున సంతోషంతో పొంగిపోయాడు. నాలుగురోజులు గడిచీ. గడవకముందే సంసారబంధం ఏర్పడింది. ఇద్దరితో ప్రారంభమయినసంసారం యీనాడు ఎనమండుగురుతో నిలిచిపోయింది. అంటే అతనికి ఆరుగురు పిల్లలు. పెద్దవాడు, రెండవాడు నాలుగుకాసులు ఎలాగో తెస్తున్నారు. మూడోసంతానమైన ఆడపిల్లకు మొన్ననే మూడు ముళ్ళు పడ్డాయి. మిగతా వారంతా పసివారు. ఇంటినీడనే జీవిస్తున్నారు. ఇదీ అతని కథ.

వృత్తిపోర్టర్. సమస్యలెన్నో వున్నాయి. జీవితానికి సంబంధించినవీ, కుటుంబానికి సంబంధించినవీ, వృత్తికి సంబంధించినవీ ఆసమస్యలు.

అందరికి ఎన్ని సమస్యలో, ఇతనికీ అన్నేసమస్యలు. మద్రాసుసెంట్రల్ లో వున్న 424 మందిపోర్టర్లలో అతనూ ఒకడు. రోజుకు నాలుగు లేక ఐదు రూపాయిలు సంపాదిస్తాడు. ఈ నాలుగు కాసులకు ఎన్నో అవాంతరాలు. మధ్యమధ్య అధికారుల జులుం. తోటివారితో పోటీ..... ప్రయాణికులతో గలాటా!

సాధ్యమయినంత వరకు ఇద్దరుపోర్టర్లు ఎప్పుడూ పోట్లాడుకోరు. పైగా, ప్రయాణికులతో ఏదయినా పేచీ వస్తే వాళ్ళంతా ఒకటవుతారు.

"ఎందుకు అలా ఒకటి అవుతారు?" అని అడిగాను.

"ధర్మంకోసం బాబూ. మాసేరు మాకు దక్క



ఇంటకెళ్ళగానే, పాపాయికి కాసేపు పాఠాలు చెప్తాడు ఒక పోర్టర్.



'రైళ్ళ నడకకూ, మా జీవితాలకూ ఎంతో సంబంధం' వున్నది.

# పోర్టర్ భగవంతం

ఉంటే'' అని చెప్పాడతను.

అతని చెప్పే మాటల్లో పోర్టర్లంతా న్యాయంగా వ్యవహరిస్తారన్న ధోరణి కనిపించింది. అలా వుండటం సహజం. కారణం ఏమంటే, ఎవడికివాడు తన వృత్తిని ఆక్షేపించుకోడు గనుక!

''అయితే, మీ పోర్టర్లెప్పుడూ అక్రమంగా డబ్బులు తీసికోరంటూనా?'' అని అడిగాం.

''అలా అనను. మాలో వున్నారు కొందరు వెధవలు. వాళ్ళవల్ల అందరికీ చెడ్డపేరు వస్తుంది'' అన్నాడతను.

నా మటుకు నాకు వీళ్ళ (పోర్టర్ల) నిజాయితీ నమ్మ బుద్ధి కాలేదు. ఒక్కమారు సెంట్రల్‌కు వెళ్ళితే పోర్టర్లు చేసే అల్లరి ఆగడాలు తెలుస్తాయి. ఎంతదాకానో ఎందుకు, కొన్నేళ్ళక్రితం యీ విలేఖరి తొలిసారిగా మద్రాసు వచ్చిన సందర్భంలో పోర్టర్లతో విచిత్రమైన అనుభవమే కలిగింది. కొత్తవాళ్ళను ఎలా బోల్తా కొట్టాలో పోర్టర్లకే తెలుసు. ఈమాట మనందరికీ తెలుసు.

భగవంతం ఎన్నోసంగతులు చెప్పాడు. ప్రయాణీకులు తమ వస్తువులను ఎక్కడెక్కడో పారేసుకొని, పోర్టర్లకు దొంగతనాన్ని అంట కటతారట. భగవంతానికి కూడా అలాంటి అనుభవం ఒకటి యీమధ్యనే జరగటంతో, నాయగుహారాలునా... రైల్వేశాఖ అతన్ని వుద్యోగం నుంచి తొలగించటం జరిగింది.

రైలుస్టేషను ఆవరణలోనే జీవితాన్ని అంతా గడిపేస్తున్నప్పటికీ, పోర్టర్లకు ప్రభుత్వం తరఫున సదుపాయాలు ఏవీ లేవు. వాళ్ళ కష్టమే వాళ్ళకు మిగుల్తుంది. సంవత్సరానికి రెండు జతల బట్టలు మాత్రం ప్రభుత్వం ఇస్తుంది.

పైగా, యీరోజుల్లో ఆదాయం తగ్గిపోయిందంటాడు భగవంతం. రోజుకు పదిరూపాయిలు వస్తే ఆరోజు పండగ. పూర్వం యుద్ధంరోజుల్లో రోజుకు 50 రూపాయిలకు వచ్చిన సందర్భాలు కూడా వున్నాయట. రైళ్ళలో దొంగతనంగా సీట్లు రిజర్వు చేయటం, వాటిని రూపాయికి, రెండు రూపాయిలకు అమ్మటం అంతానిజమేనని ఒప్పుకొన్నాడతను. ఇదంతా ''పొట్టకోసం''!.. పైగా, ఇలా సంపాదించిన డబ్బు అంతా తమకే రాదనీ, ఇంకెవరికో వాటాలు వెళ్తాయని భగవంతం కథనం.

వీళ్ళకు మేస్త్రీలు వుంటారు. మేస్త్రీల చెప్పుచేతుల్లో వీళ్ళవుంటారు. క్రమశిక్షణను పోర్టర్లు విధిగా పాటించాలి. రైలు రాగానే ఎగబడకూడదు. ప్లాట్‌ఫారం మీద కూర్చోవాలి. తమముందు ఆగేపెట్టెలోవుండే ప్రయాణీకుల సామాన్లను మాత్రమే తాము తీసికొంటారు.

ఇలా గడుస్తుంటాయి వీళ్ళ జీవితాలు. అయినా, అందరి జీవితం ఒకలా వుండదంటాడు భగవంతం. అందరూ తనంతటి దురదృష్టవంతులు కాదనే అతని నమ్మకం.

''మరి, భగవంతం, పెద్దవాడివి అయిపోతున్నావ్ కదా! నీకేమి కోరికలు లేవూ?'' అని అడిగాను.

వింతుగా నవ్వాడతను. ఒక్క. క్షణకాలంపాటు ఆలోచించాడు :

''కోరికలా? ఏం కోరికలు! జీవించాలనుకోవటమే ఒక పెద్ద కోరిక. అందుకోసమే యీ తిప్పలు'' అన్నాడు భగవంతం.

''ఏం, డబ్బు సంపాదించాలని, అందరిలాగా మేడల్లో వుండాలని అనుకోవూ?''

''అయ్యో? అంత అదృష్టమా?'' అసలు అలాంటికోరిక కోరుకొనే తాహతుగాని, హక్కుగాని తనకు లేదంటాడు.

భగవంతం మంచిమనిషి. ప్రయాణీకులతో ఎలా వున్నాడో తెలియదుకాని, నాతోనూ, నా ప్రభాకర్‌తో మాత్రం ఎంతో సన్నిహితంగా వున్నాడు. అతనితో మేము గడిపిన ఐదారుగంటలలో అతనెంతో దగ్గరివాడయ్యాడు. తన ఇంట్లో వారిందరికీ పరిచయించేశాడు. చిన్నపిల్లను నాచేతి కిచ్చాడు. మేం వెళ్ళగానే పాలు తెప్పించాడు. 'వద్దంటే వద్దన్నాం. అతను వినలేదు. మాకు కూడా ఆ పాలు తాగకతప్పలేదు.

అతన్ని వెతుక్కొంటూ మేము వెళ్ళటం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించింది. ''మాతో అవసరం వుండే వాళ్ళుకూడా యీ లోకంలో వున్నారా?'' ఇదీ అతని సందేహం.

''తప్పకుండా వున్నారు భగవంతం. అందరితోటి అందరికీ అవసరాలుంటాయి. అదే మన జీవన విధానం'' అని చెప్పాం నేనూ, ప్రభాకర్.

మా మాటలు విని అతను తృప్తితో నవ్వాడు.



మధ్య మధ్యలో కాస్త విశ్రాంతి..

# యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు

యువకులు ఫిలిప్స్‌ను అభిలషిస్తారు....చురుకైన ఆటగాళ్లు, విద్యార్థులు....చాలామంది స్నేహితులుగల విలాసవంతులు...మంచి భవిష్యత్తును ఆశించే యశస్కాములు. ఒక్క మాటలో చెప్పాలంటే మీవంటి యువకులు - ఫిలిప్స్ ఎందుకు? వాళ్ళే అంటారు మీతో. ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది. (ఇది అసలైన టెంపర్ ఉక్కుతో తయారైంది). ఎంత చెడతొక్కినా తట్టుకోడానికి వీలుగా ఉంటుంది - ఇంకా ఫిలిప్స్ అందంగా ఉంటుంది. దీని స్నిగ్ధత, గంభీరత సంస్కృతిని ప్రతిబింబిస్తాయి. విశిష్టకరమైన బైక్. మొత్తంమీద నేటి చురుకైన యువకులకు ప్రత్యేకంగా విధానింప బడినది.

మీరు **ఫిలిప్స్**ను అభిలషిస్తారు

టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా
అంబత్తూరు, మద్రాసు-౫౩

(ప్రొప్రైటర్స్:
ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్
ఆఫ్ ఇండియా లి॥ మద్రాసు)



# ఆ అధిక తెలుపును చూడండి!

# మెక్లీన్స్ వల్లనే





**ఇట్లు శోధించి చూడండి**

1. మీ నాలుక కొనతో మీ పళ్లమీద తడమండి, జిగటగా అంటుచున్న పొర తగులుచున్నదా?
2. ఇప్పుడు బ్రష్‌తో తోమండి, మీరు చవి చూచునట్టి జలదరించే పరిశుభ్రతగల రుచి మెక్లీన్స్ పనిచేయుచున్నదనుటకు నిదర్శనం...మీ పళ్లను శుభ్రపరచుచున్నది, కాపాడుచున్నది, తెల్లగా జేయుచున్నది.
3. అధిక శుభ్రతను గమనించండి ...అధిక తెలుపును చూడండి! మెక్లీన్స్ వల్లనే.




మెక్లీన్స్ పసుపురంగుగా వుండే పళ్లను తెల్లగా జేయును.

---

ఆరోగ్య అనారోగ్య పరిస్థితులలో మహిళలు ఆధారపడునది

**లోధ్ర**

ఆరోగ్య సౌభాగ్యములకు

65 సంవత్సరముల పైగా ప్రసిద్ధి నొందినది

**కేసరి కుటీరం (ప్రైవేట్) లిమిటెడ్**
రాయపేట, మద్రాసు-14

ఏజంట్లు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)

---

మీ దగ్గు త్వరగా పోవును

దాతి మరియు గొంతుగ నొప్పికి

**పెప్స్**ను మీరు తీసుకోండి

పెప్స్‌ను చప్పరించి, నొప్పిని నివారించే చర్యను జరుపునట్టి అందరి కమనకరమైన ఆవిరులను పొందండి. అవి గొంతుగ నొప్పి, బ్రాంకైటిస్ దగ్గు మరియు జలుబును గలిగించే క్రిములను చంపుటకు సహాయపడును. పెప్స్ త్వరగా నివారణను గలిగించును.

ఇందులో హానికరమైన ఓషధులు లేవు. పిల్లలకు సురక్షితంగా ఇవ్వవచ్చును

బ్రాంకైటిస్, గొంతుగ నొప్పి, పడిశెము, అధిక కఫము, జలుబులు మరియు దగ్గులను త్వరగా నివారించును.

అన్ని వ్యాపారులందరివద్ద అమ్మబడుచున్నవి.

సి. జె. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

డిస్ట్రిబ్యూటర్లు:
ఆంధ్రప్రదేశ్: మెస్సర్స్ వినోద్ & కం., పి. ఒ. బాక్సు 148, హైదరాబాద్-12.


న్యూస్‌ప్రింటు కొరత
పత్రికా ప్రపంచం


మా షరతులు
సంతకం పెట్టండి
విదేశీ పెట్టుబడి దారుడు
మన షరతులు
టి.టి.కె.


కామరాజు తలనొప్పి


అవినీతి నిర్మూలన
పడవ మునక
OOMMEN

# నిజం మాత్రం చెప్పి లాభం లేదు!

## లెస్టర్ గ్రిన్‌స్పూన్

**'నేటి నాగరిక ప్రపంచం అత్యంత ప్రమాద పరిస్థితిలో ఉంది' అనటంలో అతిశయోక్తి లేదు. అది ఉన్న నిజం.**

అయినా, ప్రజాబాహుళ్యంలో కాని, నాయకులలో కాని ఈ నిజం తెలుసుకుని తగిన చర్య తీసుకోవాలనుకునేవారు ఎంతమంది ? ప్రాణాలకే ముప్పు వచ్చినప్పుడు తమ కర్తవ్యం తెలుసుకుని వాటిని రక్షించుకొనటానికి ప్రయత్నించటం సహజం కాదా?

ఇటీవలే అమెరికాలో ఒక ప్రజాభిప్రాయ సమీక్ష జరిగింది. ఈ సమీక్షవల్ల తెలిసిన విషయం : "జాతీయ, అంతర్జాతీయ సమస్యలని గురించి ఆలోచించేవారు నూటికి 13 కన్నా లేరు; ప్రపంచ యుద్ధం గురించి ఆలోచించి ఆందోళన చెందేవారు 4 శాతంకన్నా లేరు....."

దీనికి కారణం ఏమిటి ? ఉన్న సంగతి వారికి తెలియదా ? లేక వీరికి తెలియకుండా ఉంచాలని కొందరు కుట్రలు పన్ని సఫలీకృతు లవుతున్నారా?

ఈ ప్రశ్నలకి సమాధానాలు చెప్పటం కష్టం. ఎంత ప్రజాస్వామ్య రాజ్య మయినప్పటికీ అందరికీ సరయిన సమాచారం లభించదు. కాని— ప్రచ్ఛన్న యుద్ధం, అణ్వస్త్రాలు అందరికీ తెలిసిన విషయాలే. ప్రస్తుతం ప్రపంచం ఎదురుకొంటున్న ప్రమాదం ఎటువంటిదో అర్థంచేసుకొనటానికి పెద్ద తెలివి అక్కరలేదు.

అసలు చరిత్ర చూస్తే ఇటువంటి ఉదాహరణలే ఎక్కువగా కనిపిస్తాయి. 1930 ప్రాంతాలలో యూదులని ఆవరించబోయే భయంకర ప్రమాదాన్ని కొందరు గుర్తించి మిగిలినవారికి చెప్పబోయారు: కాని వారు అశ్రద్ధ చేశారు. 1946 లో ఆల్బర్ట్ అయిన్‌స్టెయిన్ అన్నాడు : "అణుశక్తి విడుదలతో మన ఆలోచనా పద్ధతులు తప్ప అన్నీ మారిపోయాయి. మనం మాత్రం సాటిలేని ప్రళయంవైపు కొట్టుకుపోతున్నాము..."

1960, మే నెలలో హిలో (హవాయి) అనే వూరుమీదకి ఉప్పెన విరుచుకుపడింది. 16 మంది చచ్చిపోయారు. వందలమంది గాయపడ్డారు. ఇంతకీ, ఈ ఉప్పెన వస్తుందని అక్కడివారికి తెలీక కాదు. వాతావరణ పరిశోధకులు ముందుగా హెచ్చరికలు ఇచ్చారు. కాని నూటికి 41 మంది మాత్రమే ఆచోటు వదలి వెళ్లారు. మిగతా 59 మందీ 'ఏమవుతుందిలే' అన్నట్లు అశ్రద్ధ చేశారు.

ప్రజలు ఇంత పెద్ద ప్రమాదం ఉందని వింటున్నప్పటికీ ఎందుకు మేలుకోరు ?

అణ్వస్త్రాల యుద్ధం వస్తే ఏమి జరుగుతుందో వూహించేవారికి కొదువలేదు. కాని జరగబోయే ఘోర ప్రమాదం తట్టుకోలేక తమ తలపులని అణచి పారవేస్తున్నారన్నమాట. మనిషిని భయం ఆవరించినప్పుడు ఆ భయాన్ని నొక్కిపెట్టటం అనాదిగా వస్తున్న అలవాటు. చావు విషయం ఇంతేకదా !

అణ్వస్త్రాలు ప్రమాదవశాత్తు పేలి యుద్ధం రావచ్చునని ఎంతోమంది ఘోష పెడుతూనే వచ్చారు. దీనిని పెడచెవిని పెట్టటానికి కారణాలు రెండు కనిపిస్తాయి.

మొదటిది : అస్త్రాలకీ, వాటిని గురించి ఆలోచించగలిగినవారికీ— అంటే వాటి వాతనపడే అవకాశాలు కలవారికీ— మధ్య చాలా దూరం ఉంటుంది. అందుచేత, ఎన్ని రాకెట్లు వచ్చినా, ఫరవాలేదనుకునే ధోరణి బలపడుతుంది.

రెండవది : యుద్ధం అంటే, అందరి వూహలలోనూ ఒక రకమయిన 'స్వరూపం' కలిగి ఉంటుంది. ఎక్కడో ఒక మీట నొక్కి ప్రపంచ ప్రళయం తేవచ్చు నన్నది సాధారణంగా తలకి ఎక్కదు.

ఒకవిధంగా చూస్తే ప్రమాదాలని గురించి ఆలోచించకపోవటం మంచి పద్ధతే, ప్రతి దానికీ భయపడితే, విమాన ప్రయాణం, శస్త్రచికిత్స, మాంసాహారం మొదలయినవి వీలు కానే కావు కదా !

**అత్యంత ప్రమాద పరిస్థితిలో నేటి నాగరిక ప్రపంచం**

ఆత్మవంచన మరొక విధంగా జరగవచ్చు. జరిగే ప్రమాదాలన్నీ 'శత్రువులకి' మాత్రమే జరుగుతాయనే నమ్మకం ఏర్పడి గట్టి పడవచ్చు.

లేదా, "అంత ప్రమాదకరమయినవి కాబట్టి జరగదు లె"మ్మనీ, "నాయకులకి మాత్రం ఇవన్నీ తెలీవా" అనే ధోరణులు అలవరచుకుంటారు ప్రజలు.

ఇటువంటి వైఖరులకీ, ధోరణులకీ మనశ్శాస్త్రవేత్తలు ఎన్నో పేర్లు పెట్టారు— 'ఇంటలెక్చ్యువలైసేషన్', 'డిఫెన్స్ ఆఫ్ డాగ్మాటిసం' వగైరా .... కాని, వీటన్నిటి ఫలితం ఒకటే; ఉన్న ప్రమాదం లేదనుకుని ఆత్మవంచనకి లోనవటం.

కొందరు ఒక పరిష్కారం చెప్తారు. ప్రమాదాలని గురించి వీలయినంత సమాచారాన్ని బాగా ప్రచారంచేసి ప్రజలలో సంచలనం తీసుకురావాలంటారు. దీనిలో ఒక ప్రమాదం ఉంది ! అందరూ తట్టుకోలేనంత ఆందోళనలకి లోనవవచ్చు. ప్రపంచంలో కలహాలు ఇంకా అధికం అవవచ్చు కూడా! నిజం చెప్పాలంటే, భయం ఎక్కువయినప్పుడు వివేకం నశించిపోతున్నదన్న విషయం లోక సామాన్యం.

ఒక చిన్న జరిగిన కథ చెప్తాను. కొంతకాలం క్రితం నేనూ ఒక మిత్రుడూ ఒక విమానంలో ప్రయాణంచేస్తూ సముద్రంలో చారల చేపల మందలకోసం కలయచూస్తున్నాము. వీటిని కనిపెట్టిన తరువాత తీరంమీద దిగి మామూలుగా చేపలు పడ్తామన్నమాట .... ఆరోజు ఎంత తిరిగినా ఇద్దరు జాలరులు, వారికి 500 గజాల దూరములో 'స్కేట్' లనే ప్రమాదకరమయిన చేపలూ మాకు కనిపించాయి. జాలరులకి సాయపడాలనే ఉద్దేశంలో దిగి ఎక్కడా 'చారల చేపలు' లేవనీ, స్కేట్‌ల ప్రమాదం ఉందనీ చెప్పాము. ఈ సమాచారం వారికి సంతోషం కనిగిస్తుందని మేము ఎదురుచూడలేదు కాని కోపం రావటం మాకు ఆశ్చర్యం కలిగించింది.

ఆలోచించి చూస్తే ఇందులో అంత ఆశ్చర్యం కలిగించేది లేదేమో అని తర్వాత అనిపించింది. ఈ చేపలు పట్టేవా రిద్దరూ ఎంతో శ్రమపడి ఆ నిర్జన ప్రదేశం చేరుకున్నారు. రోజంతా చేప పడలేదు. "దొరుకుతుంది, దొరుకుతుంది" అనుకుంటూ ఉంటే మేము దిగివచ్చి, 'లాభంలే' దని చెప్పటం వారికి కష్టం కలిగించకుండా ఎలా ఉంటుంది? సృజనాత్మకమయిన సూచన లేకుండా నిరాశ మాత్రం కలిగిస్తే ఇంతే ఫలితం !

అందుకనే, 'ఉన్న సంగతి చెప్పెయ్యటం' అన్ని సమయాలలోనూ మంచిదికాదు.

సాభిప్రాయ విశేషం అన్నది ఉన్నప్పుడు సత్యం 'సాపేక్ష గుణం' కలది అని గ్రహించాలి. ఒకవైపు ఈ విషయాన్ని మనస్సులో ఉంచుకుని, రెండవవైపు మనని భయపెట్టగలిగే ప్రమాదాన్ని ఎలా ఎదుర్కోవాలో వూహిస్తూ సమస్యల పరిష్కారాల కోసం వెతకటం ఉత్తమం.

1961 లో నేనూ, నా సహోధ్యాయుడు ఒకడూ అణ్వస్త్రయుద్ధం గురించి ఒక వ్యాసం ప్రచురించాము. ఈ వ్యాసం ఫలితంగా మాకు 38 ఉత్తరాలు వచ్చాయి. వీటిలో 34 మా వ్యాసం సంచలనం కలిగించినదని సూచించాయి. ఈ 34 లో 13 మాత్రమే సృజనాత్మకమయిన సూచనలు చేశాయి. మిగతా 34 ఉత్తరాలు వ్రాసినవారూ నిస్పృహ వెలిబుచ్చారు. ఒక విలేఖరి పూర్తి నిరాశ చూపించాడు. నలుగురు ఆత్మహత్యలే మంచివి అన్నారు. 15 మంది దేశాలు వదిలి పారిపోవా లన్నారు. అంటే, ముగ్గురిలో ఇద్దరు బయటి పరిస్థితులని ఎదుర్కొనే శక్తి చూపలేకపోయారన్నమాట.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే, ప్రజల విశ్వాసాదరణలకి పాత్రుడయిన నాయకుడు కేవలం ప్రమాదాన్ని వివరించి వూరుకుంటే చాలదు. వాటిని ఎలా ఎదుర్కోవాలో కూడా సూచించాలి.

(గాంధీపీస్ ఫవుండేషన్ సౌజన్యంతో) ★

---

**రచయిత సుప్రసిద్ధ అమెరికన్ మానసిక శాస్త్రవేత్త.**

ఆశ్చర్యకరమైన
క్రొత్త ఫార్ములా

పెప్సోడెంట్ యొక్క అద్భుతమైన నురుగు
మీ పళ్లను మెరిసేలా తెల్లగా చేస్తుంది

ఎలా అంటే: క్రొత్త ఫార్ములా ప్రకారము తయారైన పెప్సోడెంట్‌లో మాత్రమే అద్భుతమైన నురుగును యిచ్చే 'ఇరియమ్-ప్లస్' చేర్చబడినది. ఈ అద్భుతమైన నురుగు పళ్లను పాడుచేసే పసుపు పచ్చని పొరను తొలగిస్తుంది. మీ పళ్లు సహజమైన తెల్లదనముతో మెరుస్తూ ఉంటాయి... మీ నోరు పెప్పర్‌మింట్ రుచితో పరిశుభ్రముగా ఉంటుంది.




హిందూస్తాన్ లీవర్ లిమిటెడ్ వారిచే భారతదేశములో తయారుచేయబడుతోంది

JWT-HDL-3469

“లక్ష్మీ ఇంక ఏడవకు నీకసలే నీరసంగా ఉంది” అన్నాడు మధు.

“ఏమండీ నాకీ జన్మకు అమ్మా అని పిలిపించు కునే అదృష్టం లేదా? నేనేం పాపం చేశాను?”

“ఊరుకో లక్ష్మీ ఇప్పుడు మనకేమి లోటని. నువ్విలా ఏడిస్తే నేను చూడలేను”

“నాకేం లోటులేదు బంగళా అంత ఇల్లుంది. కారుంది. నౌకర్లు, చాకర్లు అందరూ ఉన్నారు. కాని కాని. .. ఏమండీ ... ”

“లక్ష్మీ మరీ పసిపిల్లవవుతున్నావు నీకేమైనా పిచ్చిపట్టిందా. నా మాట కాస్త వినవూ, ఈ పాలు కాస్త తాగు.”

“నిజంగా నాకు పిచ్చెక్కక ఏమవుతుంది పాప పెరిగి పెద్దదై నన్ను అమ్మా అని పిలిస్తే ఎంత పొంగిపోయేదాన్నో. పాపకి బుల్లి బుల్లి గౌన్లు కొడిగి మనిద్దరం కార్లో కూచుని పాప కబుర్లంటూ షికారెడుతుంటే ఎంత బాగుండే దండీ నా పాపేది లేదు. నా పాప లేదు. చక్కగా మీరు క్లాసీసు కెడుతుంటే పాప టా టా చెబితే ఎంత బాగుండేదండీ. ఏమండీ మాట్లాడరేం.”

“ఏం చెప్పను లక్ష్మీ. నాకు మాత్రం బాధగా లేదూ కొక్క దానికేనా ఆ మనుసులన్నీ చెప్పు” అన్నాడు మధు.

తను నిర్మలకు చేసిన అన్యాయం ఊర్కే పోతుందా! తన ఆలోచనలు ఏడేళ్ళ వెనక్కు వెళ్ళినై. తను నిర్మలకు చేసిన అన్యాయమే ఈ నాడిలా అనుభవిస్తున్నాడు. తనకు మనశ్శాంతిలేదు లక్ష్మి ఏమవుతుందో తెలియదు. లక్ష్మి ఆవే దన మరీ భరించ లేకుండా ఉన్నాడు తన కన్నీ వున్నై. కానీ ఏం లాభం? ఉద్యోగం, హోదా, పలుకుబడి, మంచి మేడ, కారు ఉన్నై. తను చేసిన అన్యాయం ఊర్కే తనను విడి వెడుతుందా. చదువుకున్న రోజులు, ఇద్దరు కనిన బంగారు కలలు, వూహించుకొన్న వూహాసౌధాలు, తిరిగిన షికార్లు అన్నీ సినిమా రీలులాగ కళ్ళముందు తిరి గినై. వప్పించాలని తలి తండ్రులను బ్రతిమా లటం. తన శాయ శక్తులా ప్రయత్నం చేశాడు ఆనాడు వాళ్ళను ఎదిరించి నిర్మలను తనదాన్ని చేసికొనే ధైర్యం లేకపోయింది. ఆనాడు తేలికగా మర్చిపోవచ్చు ననుకున్నాడు నిర్మల గూడ ఎవరినో చేసికొని తనని మర్చిపోతుందనుకున్నాడు.

నిర్మలకేం లోటులేదు. రత్నం లాంటిపిల్ల. చదువు, సంస్కారం, అందం అన్నీ ఉన్నై. కానీ నిర్మల కొక్కటే లోటు. సామాన్య సంసారంలో పుట్టడమే దానికి కారణం. తమ తాహతుకి తగి నంత కట్నం ఇచ్చుకోలేరు నిర్మల నాన్నగారు ఇన్ని మంచి గుణాలున్నా నిర్మల ఒక్క డబ్బులేని లోటు కారణంగా తనకు దూరమై పోయింది. తెలిసి తెలిసి చేతులతో చేసికొన్న సర్వ నాశనమే. తన బలహీనతే దానికి కారణం

తను ఒక్కగా నొక్క కొడుకు, తనొ కొక చెల్లెలు. ఇంతకీ చెల్లెలు, శాంత నిర్మల క్లాస్ మేట్సు. వాళ్ళిద్దరూ ఒకళ్ళని విడిచి ఒకళ్ళు ఉండేవాళ్ళుకారు. వారి స్నేహం మధ్యలో డబ్బు, హోదాలు తెర అడ్డు రాలేదు. నిర్మల శాంతా వాళ్ళింటి కొచ్చింది. శాంత వాళ్ళ అమ్మ కలిసి ఆవాళ మాట్నీకి 'సీతారామ కళ్యాణం' సినిమా కెళ్ళారు.

నిర్మల వస్తూనే శాంతా, ఓ శాంతా అంటూ చనువుగా వచ్చేసింది. ఎదురుగుండా తనసిచూసి సిగ్గుతో తల వంచుకుంది. అది తనెన్నటికీ మర్చి పోలేడు.

“ఏమండీ శాంతలేదా?”

“లేదండీ. మా అమ్మ, చెల్లాయి కలిసి సినిమా కెళ్ళారు, మాట్నీకి.”

ఎప్పుడు తను నిర్మలతో మాట్లాడలేదు నిర్మల గూడ శాంతతో కబుర్లుచెప్పి వెళ్ళిపోయేది లేకపోతే శాంత వాళ్ళమ్మతో కబుర్లు చెప్పేది అంతే.

“నాతో చెప్పలేదే. ఏ సినిమా కెళ్ళారేమిటి?”

“మీతో చెప్పకుండా మా చెల్లాయి సినిమాకి వెళ్ళకూడదన్నమాట! ఏ పని చేసినా మీ రిద్దరూ చెప్పుకుంటారండీ! అని తను కొంటెగా మాట్లా డిన దానికి నిర్మల సమాధానం ఇవ్వలేదు

“ఇంతకీ మర్చిపోయాను. సీతా రామ కల్యా ణానికి వెళ్ళారు” అన్నాడు మధు.

“వచ్చాక నేను వచ్చి వెళ్ళానని చెప్పండి” అంటూ నిర్మల వెళ్ళిపోబోయింది

“వచ్చే టైమయింది కాసేపు కూర్చోండి అంటూ ఇంతకీ మా శాంతకి బాగా మార్కు లొస్తాయా, మీకా. మీ రిద్దరిలో ఎవరు బాగా చదువుతారూ” అంటూ సంభాషణ కుప్రక్రమిం చాడు మధు.

“మీ చెల్లాయినే అడిగి తెల్సుకోండి ఎప్పుడూ చెప్పలేదా మా మార్కులు, మా చదువు సంగతి” అని చాల నిదానంగా నిండుగా మాట్లాడింది నిర్మల. ఇంతలో శాంత, వాళ్ళమ్మా రిక్షా దిగారు.

“నిమ్మీ ఎంత సేపటినుంచీ కూర్చొన్నావ్. నోట్సు రాసుకుందామన్న మాట మర్చిపోయాను. అమ్మ సినిమాకి తోడు రమ్మంటే వెళ్ళాను. నీతో చెప్పి వెడదామనుకున్నాను. తొందరలో మర్చిపోయాను. ఏమనుకోవకదూ” అంటూ చెయ్యి పట్టుకొని మేడమీదికి తీసికెళ్ళింది శాంత. ఇది తనకు నిర్మలతో మొదటి పరిచయం.

నిర్మలతో మాట్లాడటానికి తనకేమి అభ్యం తరంలేదు. తరచూ చెల్లెలికోసం వస్తుంది ఎవ్వరూ ఏమనుకోనేవాళ్ళుకాదు. నెమ్మదిగా వాళ్ళిద్దరకూ తెలియని ప్రాబ్లెమ్సు సాల్వ్‌చేసి పెట్టేవాడు. అర్థం కాని పాఠాలు చెప్పేవాడు. ఈరకంగా నిర్మలతో చనువు ఎక్కువైంది.

నిర్మల మనసులో ఎటువంటి ఉద్దేశ్యమూ లేదు. తనకి తెలుసు. శాంత నిర్మల సంగతులు చెబుతుంటే ఎంత కుతూహలంగా వినేవాడో ఏమిటో ఇంకా వినాలని, ఏమిటో తెల్సికోవాలని అన్పించేది.

అప్పుడప్పుడు శాంత ఇంట్లో లేనప్పుడు తనూ నిర్మల గూడ మాట్లాడుకుంటూ ఉండేవాళ్ళు.

ఓనాడు తను ధైర్యం చేసికొని తనకు నిర్మల మీద ఉన్న అభిప్రాయాన్ని చెప్పాలనుకున్నాడు. నిర్మల ఏమనుకుంటుందో. చెప్పగానే ఎలా ఉక్కిరి బిక్కిరి అవుతుందో, అసలు అంగీకరిస్తుందో లేదో. ఎన్నో ఆలోచించుకున్నాడు. ఎలాగో సంభాషణ మొదలు పెట్టాడు

“ఏమండీ మీ కింకా చదువుకోవాలని ఉందా?”

“అవకాశాన్నిబట్టి అదృష్టాన్నిబట్టి చూడా లండీ!”

“మీ అదృష్టానికేం. మీకేం లోపమని?”

“.. ...... ..............”

“ఏం మాట్లాడరూ, ఏమండీ భగవంతుడు ప్రత్యక్షమై మీకేం కావాలో కోరుకోమని అడిగితే ఏమని కోరుకుంటారు?”

“దేశంలోవున్న మొగ పిల్లలంతా , చక్కగా బుద్ధి కలిగి ప్రవర్తించాలని కోరుకుంటానండీ!”

“అయితే దేశంలోవున్న మొగపిల్ల లెవ్వరికీ బుద్ధి లేదన్నమాట!”

“అని నే నన్నానా!” అంటూ ఫక్కుమని నవ్వే సింది.

ఎంత చక్కగా ఉంది. నిర్మల అలా నవ్వు తుంటే ఎంత ధైర్యంగా నిండుగా మాట్లాడగలదు. ఆ నిర్మల తన సొంతమైతే అని వూహించుకున్నాడు.

“ఏమండీ ఎన్నాళ్ళనుంచో మిమ్మల్ని ఓ విషయం అడగాలనుకుంటున్నాను. ఇవాళ్టికి నా కీ అవకాశం కల్గింది నాకు మీ మీద చాల గౌరవాభి మానాలున్నై. మీరు మా శాంతికి వదినగారు కావా లని కోరుకుంటున్నాను ” మొదట్లో నిర్మలకి అర్థం కాలా. ఏమిటి తన అభిప్రాయం. శాంతికి వదినగారు. అంటే .....అంటే .తన భార్య కావాలని కోరిక. సామాన్య కుటుంబంలో పుట్టిన నిర్మల చాల వివేకవంతురాలు. దూర దృష్టి కలది.

“మధుగారూ సరిగా ఆలోచించి మాట్లాడు తున్నారనుకుంటాను మీ అంతస్థెక్కడ, మా అంత స్థెక్కడ. మన మధ్య చాల తెరలున్నై. అవి తప్పించటం సంఘంలో ఎవరి తరమూకాదు. మన స్నేహం ఇంతవరకూ వస్తుందని నేనూహించ లేదండీ.”

“మన స్నేహానికి డబ్బు, హోదాలు దయ చేసి ఆలోచించకండి. నేను మిమ్మల్ని మనస్ఫూ ర్తిగా ప్రేమిస్తున్నాను. మిమ్మల్ని నా దాన్నిగా చేసికోవాలని కోరుకుంటున్నాను. నే నంతట నేను కోరుకున్నప్పుడు అభ్యంతర మేమిటి”

“మన పెద్దలు ”

“నెమ్మదిగా వప్పించటానికి ప్రయత్నం చేస్తాను”

“నేను పెళ్ళి గురించి ఆలోచించుకోవటం లేదు. నేను ఎమ్మెస్సీ ప్యాసయ్యి మంచి ఉద్యోగం చేసి నా చెల్లెళ్ళని తమ్ముళ్ళని వృద్ధిలోకి తీసికు రావాలని కోరికగా ఉంది. కాని అనుకోని మన పరి చయం, స్నేహం నాకు చాల ఆశ్చర్యంగా ఉంది. కానీ స్త్రీ జీవితంలో వివాహం ముఖ్యమైన విషయం. తప్పకుండా ఓనాటికైనా పెళ్ళి చేసికోవాలి. నాకు హోదాలమీద మోజులేదు అంతస్థునిబట్టి వివా హాలు జరిగితే సుఖంగా ఉంటుందనుకుంటాను.”

“మాటి మాటికి అంతస్తు అంతస్తు అని నన్ను బాధ పెట్టద్దు, నిర్మలా!”

“నాకు మీరంటే చాల గౌరవం ఉంది” అన్నది నిర్మల.

# పాడనా బడబాగ్ని కీల!

శ్రీ వి. సి. మౌళి

తెగదన్ని నిస్పృహా
నిగళాల నీ రేయి
పొగలు సెగలై గుండె
రగిలిమండే పాట
పాడనా తీవ లతికించి,
ఎన్నడో
పాడైన ఈ హృద్విపంచి.

మెరపు కొరడాలతో
మేఘాశ్వములదల్చి,
లయ ఝుం ఝుపై భావ
రథచక్ర మెక్కించి
సాగింపనా మింటి దారి,
జగమెల్ల
మ్రోగింపనా వజ్రభేరి.

తుత్తుమురుగా సర్వ
తోత్తుంగ శిఖరాలు,
పెల్లగిలి ఈ మిట్ట
పల్లాలు చదునుగా
త్రొక్కింపనా చక్రనేమి
పాటి
దుక్కిగా ఈ వక్రభూమి.

కలిగి సుప్త వ్యథా-
గాథాంబుధులు పొంగి
పోటెత్తి నా నోట
పాటగా దూసేను
పాడనా బడబాగ్ని కీల,
సుడులెత్తి
ప్రజ్వరిల దిగ్దిగంతాల.

## ఫేర్ వెల్ టు....

అలా ఇద్దరూ స్నేహంలో అంతస్తుల మాట మర్చిపోయారు.

తనకు తెలియకుండానే నిర్మల గూడ మారి పోయింది.

ఓనాడు మధు తండ్రి "మధూ నీతో ఓముఖ్యమైన విషయం మాట్లాడాలనుకుంటు న్నాను" అన్నారు.

"ఏమిటి నాన్నగారూ?"

"అదే నీ పెళ్ళి విషయం."

"నా పెళ్ళికేమి తొందర నాన్నగారూ. ముందు శాంత పెళ్ళిచేసి . . ."

"ఇద్దరి పెళ్ళిళ్ళు ఒకసారిగా చేద్దామని మే మనుకుంటున్నాం. మనకుతగ్గ సంబంధాలు సిద్ధంగా ఉన్నై."

"నాన్నగారూ నా పెళ్ళి నా ఇష్టం లేకుండానే సంబంధాలు చూశారన్నమాట."

"నీ ఇష్టం లేకుండా ఏమిట్రా. నువ్వు పెళ్ళి పిల్లను చూసుకురా. కట్నం కానుకలు మేం చూసు కుంటాము."

"ఏం ఓ మేడ కట్టి మిస్తున్నారా. నాకు కట్నం వద్దు. కానుకలూ వద్దు. నేను కట్నం తీసికోవ టానికి ఇష్టపడను. అయినా నా పెళ్ళి ఇప్పుడు తొందరేముంది."

"తొందరేముంది. అంటేఏమిట్రా. ఏమన్నా ప్రేమ వ్యవహారమున్నదేమిటి కట్నంకానుకలు వద్దంటున్నావ్."

"........ ...... ........................... "

"ఏం మాట్లాడవేం. నాదగ్గర యివన్నీ సాగవ్. నేను చెప్పిన పిల్లను పెళ్ళి చేసికోవాల్సిందే" చిన్నప్పటినుంచి తనకు తండ్రి సంగతి తెలుసు. చాల పట్టుదల గల మనిషి. కానీ ఎలాఅయినా ఒప్పించాలను కొన్నాడు.

"నిర్మలనుచేసికోవాలనుకుంటున్నానునాన్నగారూ."

"ఏమన్నావ్. నిర్మలనా. ఆరంగనాథం కూతురినా. తినటానికి తిండి, ఉండటానికి యిల్లులేని ఆరంగనాథం కూతురినా"

"అవేం మాటలునాన్నగారూ. తిండిలేకపోవట మేమిటి. ఇంటినిండా నలుగురు పిల్లలున్నారని అంతతేలికగా మాట్లాడతారా?"

"అయితే వాలదాక వచ్చిందన్నమాట. ఇది ఎంతమాత్రం జరగటానికి వీల్లేదు. నేను లేనను కున్నావా. తండ్రిలేని కొడుకులాగ స్వతంత్రించి దిక్కులేని పిల్లని నాయింటి కోడలుగా తెస్తావా! వీల్లేదు ఎంతమాత్రం వీల్లేదు. నా కంఠంలో ప్రాణం వుండగా జరగటానికి వీల్లేదు"

తనతల్లి పెత్తనం యింట్లో ఏమిలేదని మధుకి తెలుసు. కానీ ఆశ. తల్లి ద్వారా రెకమండేషన్ చేయించాడు.

"ఇదిగో చూడు తల్లీ కొడుకు ఏకమైనా నన్నేం చెయ్యలేరు నామాట ప్రకారంజరక్క పోతే మీయిద్దరికీ నా యింట్లో స్థానం లేదు."

"నాన్నగారు చెప్పిన పిల్లనే చేసికోరా. ఏ పిల్ల అయితే ఏమిరా నాయనా" అంటూ బతిమా లింది తల్లి.

"అమ్మా నేను నిర్మలని మర్చిపోలేను"

"నువ్వు ఒక్కగా నొక్క కొడుకువి. ఆయన మాట వినరా." తల్లి బలవంతం.

తండ్రిలో మార్పేంలేదు. "నీ తల్లి, తండ్రి నీకు లేరనుకొని నీ ఇష్టం వచ్చినట్లు చేసికో. ఒక్క సారి పెళ్ళి పారేస్తే నీ కడ్డం ఉండదు. అంతేగాని మేము బ్రతికి ఉండగా మన వంశ మర్యాదలకి, హోదాకి తగ్గటానికి వీల్లేదు" అన్నా రాయన.

ఇంట్లో ఇటువంటి పరిస్థితిలో మధులో ధైర్యం తగ్గిపోతోంది. తను నిర్మల మొహం ఎలా చూడటం. తనంతట తను ఆశ కల్పించి, తను ఊహలు పెంచి పెద్దవిచేసి తుంచేస్తున్నాడు. చేసికోకపోతే నిర్మల ఏమైపోతుందో. అసలు ఏ రకంగా చెప్పను. నిర్మలా నిన్ను పెళ్ళి చేసికోలేను అని చెప్పాలా. ఎలా ఈ నోటితో చెప్పగలను. నాన్నగారి మనస్సు ఏ రకం గానూ మారదు. తనలా దిగులుగావుంటే తనను ప్రాణంగా చూసుకొనే చెల్లెలు భోజనమే చెయ్యదు. ఈ రకంగా ఉంది ఇంటి పరిస్థితి. తనేం చెయ్యాలి. నిర్మలకు ఉన్న సంగతంతా చెప్పాలి. ఆ దేవతే క్షమిస్తుంది. అంతకంటే తనేం చెయ్యలేడు.

నెమ్మదిగా ఓరోజు సాయంత్రం నిర్మలా వాళ్ళింటి కెళ్ళాడు. ఆకాశమంతా మేఘాలతో నిండి ఉంది. దగ్గరేకదా వర్షంలో తడిసిపోమని బయలుదేరాడు. వెళ్ళగానే నిర్మల ఎప్పటి తన చిరునవ్వుతో పలకరించింది.

"మధుగారూ రండి లోపలికి. ఏమి టివాళ ఇలా వచ్చారు. మా శాంత ఏమి నన్ను పిల్చుకు రమ్మనలేదుకదా!" అంటూ కుర్చీ చూపించింది. ఇద్దరూ గదిలో కూర్చున్నారు. తలుపు దగ్గరగా వేసి ఉంది.

"ఏమిటలా ఉన్నారు. వంట్లో ఆరోగ్యంగా ఉండటం లేదా?"

"మీతో ఎలా చెప్పాలో నాకు నోరు రావటం లేదు. నన్ను క్షమించగలరా? మీకు నేను తీరని ద్రోహం చేశాను. మీ కన్యాయం చేస్తున్నాను" అంటూ తన ఇంట్లో పరిస్థితినంతా ఒక్కటీ ఒదలకుండా చెప్పాడు.

"ఇప్పుడు నా కర్తవ్య మేమిటి. మనిద్దరం ఎక్కడికన్నావెళ్ళిపోదామా.మీరు అంగీకరించేట్టయితే."

"వద్దు మధూ వద్దు. నాకోసం మీవారందరికీ దూరం కావద్దు. సంఘంలో ఫలానా నిర్మల లేచి పోయింది అన్నమాట నేను పడలేను. నా చెల్లెళ్ళు, తమ్ముళ్ళ భవిష్యత్తు ఏమవుతుంది. వారికి ఒక్కరికీ పెళ్ళిళ్ళుకావు. ఈ దిగులుతో మా తలి తండ్రులు తలెత్తుకు తిరగలేరు. నా ఒక్కదాని మూలంగా మా కుటుంబానికీ, స్త్రీ జాతికి మచ్చ తేలేను. నేను సంతోషంగా మీ పెళ్ళికి వస్తాను. ఎలా రాసిపెట్టిఉంటే అలా జరుగుతుంది. నా జీవి తంలో అదృష్ట మింతే అనుకుంటాను" అని నిర్మల గంభీరంగా ఆనాడు చెప్పిన మాటలు జీవితంలో మరుపురానివి.

తరువాత లక్ష్మితో తన ఇష్టం ఏమాత్రం లేకుండా సర్వ లాంఛనాలతో పెళ్ళి జరిగింది. తన పెళ్ళితోపాటు తన చెల్లెలు, శాంత వివా హమూ అయింది. బియస్సీ ప్యాసవగానే శాంత చదువు ఆపించి నాన్నగారు పెళ్ళి చేశారు నాన్న గారి కోరిక తీరింది. నిర్మల ఎలాగో యూనివర్శిటీ కెళ్ళి ఎమ్మెస్సీ ఫస్టు క్లాసులో ప్యాసయింది. నిర్మల మొహములో నవ్వు మాయలేదు. శాంత, నిర్మల స్నేహంలో మార్పేమీలేదు. ఏమీ జరగ

పెట్టుగానే పిండుగావున్న నిర్మలను చూసి మధు ఆశ్చర్యపోయాడు. వారి స్నేహం తొందరలోనే మర్చిపోయిందని సంతోషపడ్డాడు. నిర్మల తన పెళ్ళికివచ్చి టాగూర్ రచించిన "ఫేర్ వెల్ టు మై ఫ్రెండు" ప్రెజెంటు చేసింది. తను తేలికగా మర్చిపోగల ననుకున్నాడు. తలి తండ్రులను విదిరించి తనిష్ట మొచ్చినట్లు చేసికొంటే ఏం అను కున్నాడుగాని ఆ ఆలోచనను అమలులోకి పెట్టలేక పోయాడు.

లెక్చరరుగాచేరి ఉద్యోగం చేస్తున్న నిర్మల చెల్లెలి వివాహమయింది. ఈ వార్త విని మధు కుమిలిపోయాడు. నిర్మల ఇంక పెళ్ళి చేసికోదా దగ్గరుండి తన చెల్లెలి వివాహం జరిపిస్తోంది. ఏమిటి తనని మర్చిపోలేదా? అంత సంతోషంగా ఎలా ఉండ గలుగుతోంది? ఇలా అనేక విధాలు ఆలోచించాడు.

శాంత పురిటికి పుట్టింటి కొచ్చింది స్నేహితు లిద్దరూ మాట్లాడుకుంటున్నారు. తను అక్కడికి వెడితే నిర్మల వెళ్ళిపోతుందని పక్క గదిలో కుర్చీలో కూచుని వారి సంభాషణ వింటున్నాడు మధు.

"శాంతా మీ అత్తవారింట్లో అంతా కులాసానా. మీవారేమంటున్నారు? బాబు కావాలన్నారా, పాప కావాలన్నారా" ఇలా సరదాగా మాట్లాడుతున్న నిర్మల మాటలకి ఆశ్చర్యపోయాడు మధు.

"అయితే నిమ్మీ, నీ స్నేహితురాల్ని. మన మధ్య ఏ దాపరికాలూ లేవు. నీ జీవితం గురించి నీకు జరిగిన అన్యాయాన్ని గురించి నేను ఎంత ఏడ్చాను నిమ్మీ. ఏమిటి నువ్వు ఇంకా పెళ్ళి చేసి కోవా?"

ఈ సంభాషణతో మధులో కుతూహలం ఎక్కు వయింది.

"శాంతా నేను ఆ ఆలోచనే మానేశాను. జీవి తంలో హృదయస్పందన ఒకసారి జరుగుతుంది. ఆ మనసుని వేరొకరిపైపు తిప్పుకోవటం అసాధ్యం. నా జీవితమంతా మా చెల్లెళ్ళనీ, తమ్ముళ్ళనీ పెద్దవారినిచేసి వారి అభివృద్ధికోసం గడిపేస్తాను. వాళ్ళందరూ నా పిల్లలుకారా? ప్రాణంవంటి స్నేహితురాలివి నువ్వున్నావ్. అంతకంటె నాకేం కావాలి? శాంతా ఈ జీవితం ఇలా వెళ్ళిపోనీ అంత కంటె నేనేమి కోరుకోను."

"ఎంత కష్టపెట్టాను నిమ్మీ నీ మనస్సుని క్షమించవ్. ఇంకెప్పుడూ ఈ సంగతి ఎత్తను"

మధు అచేతనుడయ్యాడు. అంత సంతోషంగా వున్న నిర్మల మనస్సులో సంగతి ఇదన్నమాట ఆమె మానవమాత్రురాలు కాదు. తానా నాడు తన సంగతి చెబితే ఇష్టం వచ్చినట్లు తిడుతుం దనుకున్నాడు. కానీ ఒక్కమాట అనలేదు. నిర్మల జీవితాంతం అవివాహితంగానే గడుపుతుందనుకో లేదు తను. ఇలా ఆలోచిస్తున్న మధు కళ్ళవెంట నీళ్ళు రాలి లక్ష్మి చేతిమీద పడినై.

తన సంగతంతా లక్ష్మితో చెప్పాలనుకున్నాడు ఛీ తనని బలహీనుడని లక్ష్మి అనుకుంటుంది. చెప్పి బాధ పెట్టటం, చెప్పి లేనిపోని గొడవలు తెచ్చు కోవటమవుతుంది. ఏమి తెలియని లక్ష్మినైనా హాయిగా ఉండనీయటం తన కర్తవ్య మనుకొన్నాడు.

నిర్మలకు చేసిన అన్యాయానికి ప్రతిఫలంగా తను అనుభవించాలి. తనకీ జీవితానికి పిల్లలులేరు. తన భార్యకుతనకూ మనశ్శాంతి లేదు. అంతే. ★

## అజీర్ణము వల్ల ఎందుకు బాధ పడతారు?

# హ్యూలెట్స్ మిక్స్చర్

## వాడి త్వరగా నివారణను పొందండి

ఎడతెరిపిలేని పని మరియు చింత జీర్ణశక్తిని చెడగొట్టి ఆకలిని పోగొట్టి మంద కొడితనాన్ని కలిగిస్తాయి. హ్యూలెట్స్ మిక్స్చర్ అతిత్వరగా చిర నివారణను కలిగించును. కడుపులో ఇది రక్షణపూతగా ఏర్పడుతుంది. బాధ కలిగించే ఆమ్ల రసములను సరిపరచి తిన్న ఆహారము జీర్ణించుటకు ఉపకరించును. హ్యూలెట్స్ మిక్స్చర్ చంటిపిల్లల జీర్ణాశయ రోగములకు కూడా మంచిది. విరేచనములకు నల్లమందు కలిసిన హ్యూలెట్స్ మిక్స్చర్‌ను వాడండి.

**హ్యూలెట్స్ మిక్స్చర్ జీర్ణశక్తికి ఉపకరించును.**




C. J. హ్యూలెట్ & సన్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్ 86/A నయినియప్ప నాయక్ స్ట్రీటు, మద్రాసు-3

JWT/CJH 2830 A

## 12 3 1965 శుక్రవారం మొదలు 18-3-1965 గురువారం వరకు.

### మేషం :

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఈవారం మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేకపోవచ్చును. కాని, వృత్తి వ్యాపారాల్లో సామాన్యమైన ఫలితానికి లోపం ఉండదు. వ్యాపారంలో ఆకస్మికంగా అధిక వ్యయం చేయవలసి పరిస్థితి ఏర్పడుతుంది. వృత్తిలో భారీ ప్రయత్నాలు వాయిదా వేయడం మంచిది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంతవరకు లాభిస్తాయి. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులను వింటారు. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో కొంచెం శ్రమమీద అనుకూలత లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు బంధువుల వ్యవహారాల్లో గౌరవం బాగా ఉంటుంది.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా. రోహిణి మృగ 1, 2 పా)

వృత్తి వ్యాపారాల్లో గతవారం ప్రారంభించిన వ్యవహారాలను ఈవారం పూర్తిచేయగలరు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో సాటివారితో పోటీ తగ్గడంవలన మానసికంగా కొంత విశ్రాంతి లభిస్తుంది. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. కాని మీరు మొగమాటాలకు లొంగిపోవడంవలన కార్య భారం పెరుగుతుంది. సాంఘిక కార్యక్రమాల్లో వాద ప్రతివాదాలకు దిగడం మంచిదికాదు మీవల్ల ఉపకారం పొందిన బంధువులే మిమ్మల్ని వ్యతిరేకించవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

### మిథునం :

(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా)

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సామాన్యంగానే ఉంటాయి కాని, ఇంతవరకు మీకు మానసికంగా చికాకు కలిగిస్తున్న సమస్యలు అనుకూలంగా పరిష్కారం కావడంవల్లన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది. మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో యితరులను విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిదికాదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి అంత ప్రోత్సాహకరంగా ఉండకపోవచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది.

స్త్రీలకు—స్వల్ప అనారోగ్య సూచనలు ఉన్నాయి. ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. విలాస వస్తువులు కొంటారు.

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| బు | గు | రా | చం |
| ర శ కు | వారఫలం | | |
| | మహేష్ | | శు |
| | కే | | |

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

ఈ వారం గత వారంకంటే కొంచెం బాగానే ఉంటుంది కాని పూర్తిగా అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. ఆదాయం మామూలుగానే ఉన్నా రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలను మార్చుకొనవలసి వస్తుంది. వృత్తిరీత్యా చేసే ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో మీ పరిస్థితి సామాన్యంగా ఉంటుంది. ఇతరులు చేసిన పొరబాటులకు కూడా మీరే బాధ్యత వహించవలసిన పరిస్థితి ఏర్పడవచ్చును. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో స్వల్ప భేదాభిప్రాయాలు వస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. కళాకారిణులకు మంచి సమయం.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

వారం ప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో వ్యయ ప్రయాసలకు గురికావడం వలన, తరువాత కొంత అభివృద్ధిని సాధించినా యీ వారం అంత సంతృప్తికరంగా ఉండదు దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీ వ్యవహారాల్లో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. వృత్తిలో వారాంతంలో నూతనావకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు బాగానే ఉంటాయి గాని ఇతరుల నిమిత్తం మీరు ఒత్తిడికి గురికావలసి వస్తుంది ఆరోగ్యం ఇదివరకటికంటే బాగా ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు రాజకీయ వ్యవహారాల్లో నూతనోద్యమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

### కన్య :

(ఉత్తర 2, 3 4 పా, హస్త, చిత్త 1 2 పా)

ఈ వారం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వారం ప్రారంభంలో చేసే వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి కాని వారాంతంలో వృత్తిలో కొన్ని చికాకులు కలిగే సూచనలు ఉన్నాయి. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో ఇతరుల జోక్యంవలన ఆటంకాలు కలగవచ్చును. వృత్తిలో కొన్ని నూతనావకాశాలు ఆకర్షణీయంగా కనిపిస్తాయి గాని అవి కార్యరూపం ధరించకపోవచ్చును ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగా వుంటుంది. కోర్టు వ్యవహారాలు మాత్రం అంత అనుకూలంగా ఉండవు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

### ఈవారం ధరలు

అపరాల ధరల్లో చెప్పతగిన మార్పులు రావు. బెల్లం ధర నిలకడగా ఉండి వారాంతంలో కొంచెం పెరగవచ్చును. పసుపు ధర తగ్గే సూచనలు ఉన్నాయి. నూనె, నువ్వుల ధరలు ఒడుదుడుకులకు గురి అయి వారాంతానికి కొంచెం తగ్గుతాయి.

### తుల :

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలకు ఆటంకాలు వచ్చినా వాటిని అధిగమించి తగిన అభివృద్ధిని సాధించగలరు వ్యాపారంలో మీకు అనుకూలమైన మార్పులు జరుగుతాయి. వృత్తిలో ఇదివరకు చేజారిపోయిన అవకాశాలు కూడా తిరిగి లభిస్తాయి. ఉద్యోగంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడంవలన ఈ వారం సంతృప్తికరంగా ఉంటుంది. అనవసరమైన వ్యవహారాల్లో చిక్కుకొని ఇటువంటి అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసికొనే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సాంఘిక కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. బంధువులకు సహాయం చేస్తారు.

### వృశ్చికం :

(విశాఖ 4–వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారంలో గత వారం కంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో క్రమాభివృద్ధిని సాధించగలరు. మీకు అంతగా యిష్టం లేకపోయినా మిత్రుల వ్యవహారాల్లో జోక్యం చేసుకొనవలసి వస్తుంది. కాని తుదకు విజయాన్ని సాధించడం వలన ఆ విషయంలో పొందిన శ్రమను గమనించరు. వారాంతంలో చేసే ప్రయాణాలు మిక్కిలి ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో ఏర్పడిన వ్యతిరేక వాతావరణం తొలగదు. సంతానానికి కించి దనారోగ్యం చేయవచ్చును. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించడానికి తగిన అవకాశం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అనుకూల

ష్మైన పోటీలు వస్తాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది.

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

**వారం** ప్రారంభంలో వృత్తి వ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడవచ్చును. కానీ వారాంతానికి అన్ని వ్యవహారాల్లోను అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలు మీకే కాకుండా మీ మిత్రులకు కూడా లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో మీ పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది ఆర్థిక వ్యవహారాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు వారాంతంలో అందుతుంది. ఆరోగ్యం బాగానే ఉన్నా మానసికాందోళన కలుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో ఇదివరకు మీ సన్నిహితులతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోవడంవలన అభివృద్ధిని సాధించగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం ఇదివరకటి కంటే బాగా ఉంటుంది. శుభకార్యాల విషయాల్లో అనుకూల వార్తలను వింటారు.

### మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

కొన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉన్నా మరి కొన్ని వ్యవహారాల్లో ఆకస్మికంగా చికాకులు రావడం వలన ఈవారం మీరు సాధించే అభివృద్ధి ఏమీ ఉండకపోవచ్చును. భారీఎత్తున చేసే వ్యాపారాలు వాయిదా వేయడం మంచిది. వృత్తిలో కొంచెం శ్రమమీద మీ స్థానాన్ని నిలుపుకొంటారు. ఉద్యోగంలో మీరు యితరులను నొప్పించడానికి వెనుకంజ వేయడంవలన మీరే యిబ్బందిపడవలసి వస్తుంది. ఆర్థిక వ్యవహారాలు ప్రస్తుతం సామాన్యంగా ఉన్నా భవిష్యత్తుకు సంబంధించిన వాగ్దానాలు చేయడం మంచిదికాదు. వారాంతంలో కొంచెం అనారోగ్యం చేయగల సూచనలు ఉన్నాయి.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

### కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం,పూ. భా. 1, 2, 3పా)

ఈ వారం గతవారం కంటే బాగా ఉంటుంది. వ్యాపారంలో మీ అభిప్రాయాలకు తగిన అవకాశాలు లభించడంవలన ఆదాయం పెరగవచ్చును. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో ఇదివరకు ఏర్పడిన చికాకులు చాలవరకు తొలగిపోతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా కొంత వరకు లాభిస్తాయి. వృత్తిలో నూతనావకాశాల కోసం మీరు చేసే ప్రయత్నాల్లో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. పూర్వాభాద్ర

## వారఫలం

నక్షత్ర జాతకులకు మిగిలినవారి కంటే బాగుంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. అలంకార వస్తువులు కొంటారు.

### మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)

ఇతరుల నిమిత్తం ఏ ప్రయత్నం చేసినా నిరాటంకంగా నెరవేరుతుంది గాని మీ స్వంత వ్యవహారాల్లో కొంత ప్రతిఘటనను ఎదుర్కోవలసి వస్తుంది. వృత్తి వ్యాపారాల్లో ఆదాయం సామాన్యంగా ఉన్నా గౌరవ ప్రాబల్యాలు మాత్రం బాగా ఉంటాయి. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మోసం చేయడానికి ప్రయత్నిస్తారు ముఖ్యమైన వ్యవహారాలు మీరు స్వయంగా చూడడం మంచిది. వారం ప్రారంభంలో చేసే ప్రయాణాలు ప్రయోజనకరంగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటికంటే బాగా ఉంటాయి. సాంకేతిక కళారంగాల్లో ముందంజ వేస్తారు. ఉష్ణాధిక్యతవలన అనారోగ్యం చేయవచ్చును.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలు కొంచెం శ్రమమీద నెరవేరతాయి. సంతోషకరమైన వార్తలను వింటారు. ఉద్యోగినులకు మంచి సమయం. ★

## జన్మదిన ఫలం

### మార్చి-12

ఆర్థిక వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించినా వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు మీరు అనుకొన్నట్లుగా జరగకపోవటంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో కొంతమంది జోక్యం వలన ఆటంకాలు రావడంవలన వ్యాపారంలో మీ కార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభించక పోయినా ప్రస్తుతపు వ్యవహారాల్లోనే అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు కూడా లాభించవచ్చును. ఉద్యోగంలో స్థానచలనము కలగవచ్చును. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది కోర్టు వ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి కించి దనారోగ్యం చేయవచ్చును సంతోషకరమైన వార్తలను వింటారు. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కాగలరు.

### మార్చి-13

ఈ సంవత్సరం వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగానే ఉంటాయి గాని మీకు అంతగా యిష్టంలేని వ్యక్తులతో సన్నిహితంగా ప్రవర్తించవలసిన అవసరం అప్పుడప్పుడు ఏర్పడుతుంది భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్లో భేదాభిప్రాయాలు రావడంవలన ముఖ్యమైన వ్యవహారాలు నిలచిపోవచ్చును మీరు స్వంతముగా చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించవచ్చు వృత్తిలో దూర ప్రయాణాలు చేసి కార్యసాధన చేయగలరు. ఉద్యోగంలో అధికారులు మీపట్ల అనుకూలంగా ఉన్నా సాటివారి అసూయకు గురి కాగల సూచనలు ఉన్నాయి సాంఘిక వ్యవహారాల్లో మెప్పుకురాని బాధ్యతను వహించవలసి ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది పుణ్యకార్యాలు చేస్తారు. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కావచ్చును.

### మార్చి-14

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో విశేషమైన అనుకూలతను ఆశించడానికి అవకాశంలేదు. వ్యాపారంలో సామాన్య వ్యవహారాలకు కూడా ఎంతో కృషిచేయవలసిన పరిస్థితులు ఏర్పడడం వలన అప్పుడప్పుడు నిరాశ నిస్పృహలకు గురి కాగలరు దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీ వ్యాపారాలు సాధ్యమైనంతవరకు వాయిదా వేయడం మంచిది వృత్తిలో ఇంతవరకు మీకు అనుకూలంగా ఉన్న వ్యవహారాల్లో కూడా, కొంతమంది వ్యక్తులు చికాకులు కలిగించడానికి ప్రయత్నం చేస్తారు. ఉద్యోగంలో మీ పరిస్థితి అంత బాగా ఉండకపోవచ్చును. మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా ఇతరులకు చెడుగానే కన్పించవచ్చును. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. అనవసరమైన వ్యయం జరుగుతుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

### మార్చి-15

అప్పుడప్పుడు వృత్తి వ్యాపారాల్లో అనుకోని చికాకులకు గురి అయినా, చివరకు తగినంత అభివృద్ధిని సాధించడంవలన ఈ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. రావలసిన డబ్బుమీద ఆధారపడి నూతన వ్యాపారాలు ప్రారంభించడం వలన నష్టాన్ని పొందగల సూచనలు ఉన్నాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సంవత్సరాంతంలో ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనం గల పరిచయాలు లభిస్తాయి. సాటివారితో పోటీ కొంచెం పెరిగినా మీ కార్యక్రమాల మార్పులు రావు. ఉద్యోగంలో మీ పరిస్థితి ఇదివరకటి కంటే బాగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు మాత్రం ఇంకా అనుకూలంగా ఉండక పోవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబంలో కార్యభారం పెరుగుతుంది. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును.

# భారీయెత్తున దేశరక్షణకు
# ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం



# జన్మదినఫలం

## మార్చి-16

ఈ సంవత్సరం ఆదాయం అంతగా పెరగక పోయినా, వృత్తి వ్యాపారాల్లో క్షణం కూడా తీరిక లేకుండా కృషి చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. మీకు ఎంత ఇష్టం లేకపోయినా, వ్యాపారంలో ఇతరుల వ్యవహారాల్లో జోక్యం చేసుకోవలసి వస్తుంది మీరు స్వంతంగా చేసే వ్యాపారాల కంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి వృత్తిలో మీరు ఇది వరకు చేసిన ప్రయత్నాలు ఇప్పుడు ఫలించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. మీకంటే పెద్దలు కూడా మీ అభిప్రాయాల ననుసరించి ప్రవర్తిస్తారు. సాంఘిక వ్యవహారాల్లో ప్రముఖపాత్రను నిర్వహిస్తారు. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయతగదు. దూర ప్రయాణాలు చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు విద్యార్థులు సులభంగా కృతార్థులు కావచ్చును.

## మార్చి-17

సంవత్సరం ప్రారంభంలో అన్ని వ్యవహారాలూ అనుకూలంగానే ఉన్నా సంవత్సరాంతంలో ఆకస్మికంగా చికాకులు కలగడంవలన మీరు ఈ సంవత్సరం సాధించిన అభివృద్ధి ఏమీ ఉండకపోవచ్చును. మీరు ఇదివరకు ప్రారంభించి వదలివేసిన వ్యవహారాలను యిప్పుడు పూర్తిచేయగలరు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభించవచ్చును. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నం చేస్తారు. ఎవరినీ విశేషంగా నమ్మి వ్యవహరించడం మంచిది కాదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సంతృప్తికరంగానే ఉంటుంది. సంవత్సర మధ్యలో అనుకూలమైన మార్పులు రావచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాలు అంతగా ఫలించవు. ఆరోగ్యం బాగా ఉంటుంది కాని మానసికాందోళన కలుగుతుంది. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కావచ్చును.

## మార్చి-18

ఈ సంవత్సరం గత సంవత్సరం కంటే అనుకూలంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు రావచ్చును. ఇంతవరకు కొన్ని వ్యవహారాల చిక్కుల్లో ఉండిపోయిన డబ్బు సంవత్సరం మధ్యలో చేతికి రావచ్చును. వ్యాపారంలో ఇంతవరకు మీకు సన్నిహితంగా ఉన్నవారే కొంతమంది మిమ్మల్ని ఎదుట పొగడుతూ, చాటున దూషిస్తుంటారు వృత్తిరీత్యా ప్రయోజనంగల ప్రయాణాలు చేస్తారు ఉద్యోగంలో స్థానచలనం కలగగల సూచనలు ఉన్నాయి. మీరు ఇదివరకు చేసిన నిర్ణయాలవల్ల కొంచెం చికాకు కలగవచ్చును. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడే సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.



అవసరాల రామకృష్ణారావు

## జరిగిన కథ

మంజుల వివాహకారణంగా, ఆర్థిక అవసరాల దృష్ట్యా కొడుకుని కట్నం తీసుకొని పెళ్ళి చేసుకోమంటాడు తండ్రి; మొదట నిరాకరించినా చెల్లెలి పైగల ప్రేమతో తర్వాత సరే నంటాడు. తర్వాత మంజుల వివాహ మవుతుంది. ఆరేళ్ళు గడిచాయి. మంజు యిాలోగా బియ్యే పట్టాతోబాటు వాలుగేళ్ళ మధురిమను కూడా పొందింది. భర్తతో కాశీ వెళ్ళి ఎం. ఏ. పరీక్షలు బాగా రాశానన్న తృప్తితో తిరిగివస్తూ అన్నయ్య సంసారం ఆందోళనకరంగా ఉండటం గమనిస్తుంది. భర్త పరీక్ష పాస్ కాలేపోయినందుకు బాధపడుతుంది మంజు. వాళ్ళ సంసారంలో అపార్థాలు చెలరేగి మళ్ళీ సర్దుకుంటాయి. ఎం. ఏ ఫైనల్‌కి వెళ్ళాలని ఉబలాటపడుతున్న మంజుకు ఆశాభంగం కలిగేలా ప్రవర్తిస్తాడామె భర్త. చివరికెలాగైతేనేం ఎమ్మే పాసైనా ఉద్యోగం చెయ్యననే షరతుపై భర్తని ఒప్పిస్తుంది. కలతలతో కుంటుపడ్డ నారాయణ నిర్మలల సంసారాన్ని ఒకదారికి తెస్తుంది మంజు. మంజు, మధుర కలసి రీక్షలకు కాశీ వెళతారు. అక్కడ మధుర కేశవరావుల స్నేహాన్ని అనుమానిస్తుంది మంజుల. తమ స్నేహంలోని పవిత్రతను వ్యక్తం చేస్తుంది మధుర. మంజు అన్నయ్య ప్రసాదరావు కుటుంబం అల్లకల్లోలమవుతుంది. అతను వ్యాధిగ్రస్తుడవుతారు చేస్తున్న ఉద్యోగాన్ని, ఆదర్శం పేరుతో చేజేతులా పోగొట్టుకొనే స్థితికి వస్తాడు.

# 12

ఇది జరిగిన వారం పది రోజులకు ఆఫీసరుపై ఆకాశరామన్న అర్జీ పై అధికారులకు చేరిందట. ఎంక్వైరీ కూడా జరిగిందట. డబ్బు నిరివిగా ఖర్చుపెట్టిన ఆఫీసరు కొద్ది చివాట్లతో ఎలాగో బయటపడ్డాడుట. వాడిందులో ఏమీ ఎరగనప్పటికీ అన్నయ్యే తన గురించి పైకి రిపోర్టు యిచ్చి ఉంటాడని ఆఫీసరు అనుమానం. అందువలన నెలా రెణ్నెళ్ళుయి మరీ కాల్చుకు తింటున్నాడట. ఎంతపని చేసినా తృప్తిపడకపోవడం, పని అయిపోయినా ఇంటికి వెళ్ళనీయక పోవడం, శీవు ఒక పట్టాన శాంక్షను చెయ్యకపోవడం, ఒకటేమిటి, ఎన్ని విధాల ఏడిపించాలో అన్నివిధాలా ఏడిపించుకు తింటున్నాడట.

ఆయన ఆరోగ్యం ఇంత తొందర్లో ఇంతగా దెబ్బతినడానికి ఇది కూడా ఒక ముఖ్య కారణం అనుకుంటా మంజూ ! పనికి మించిన బలవర్ధక ఔషధం లేదనే వారాయన. ఇన్నాళ్ళుయి పని చేస్తున్నా ఎప్పుడూ ఎవరిచేతా మాటపడి ఎరగరు. ప్రస్తుతం గట్టిగా జవాబు చెప్పనూ లేరు. ఆ విషయం ఆలోచించకుండా ఉండనూలేరు. ఇలా కక్ష కడితే అవతలి వాళ్ళకి కూడా ఏం కలిసొస్తుందో నాకు తెలీదు నిరాశ అనేది ఆయనకు జీవితంలో ఎప్పుడూ లేదు గాని ఒక విధమైన నిస్పృహ ఆవరించిందేమోనని నాకు భయంగా ఉంది మంజూ ! నీ పరీక్షలని ఇన్నాళ్ళూ ఎలాగో ఆగగలిగేను.

పరీక్షల హడావిడిలో పడి ప్రాణప్రదమైన అనేక ముఖ్య విషయాలను విస్మరించినందుకు నన్ను నేనే తిట్టుకున్నాను ఆప్తుల అవసరాలను గమనించని, ఆపదలో అడ్డుకోని నా చదువుకు ఫలితమూ, సార్థకమూ ఏముంది ?

'మంజూ ! ఇవైనా నీతో చెప్పుకుంటే నా మనసు ఎంతో తేలికైపోయింది. ఇంతమాత్రాన ఈ సమస్య నిలుచున్న పళాన తీరిపోయిందని కాదు మనిద్దరం కలసి దీన్ని ఎలా సాధించడమో ఆలోచించవచ్చు. దాన్నిబట్టి నా బరువు సగం తీరిపోయినట్టే.'

వదిన చేతిని నా చేతిలోకి తీసుకున్నాను.

'మనం ఇలా కలుసుకున్నట్టు, నేను నీతో చెప్పినట్టూ పైకి రానియ్యకూడదు నువ్వే అడిగినట్టు అడిగి ఆయనకి నచ్చచెప్పి ఎవరైనా పెద్ద డాక్టరుచేత పరీక్ష చేయించి అసలా రోగం ఏమిటో అదైనా పూర్తిగా తెలుసుకుని దానికి నివారణోపాయం ఏదో ఆలోచిస్తే గాని నేను నిలద్రొక్కుకోలేను మంజూ ! నీనుంచి అదే కోరి నిన్ను ఆపుచేశాను. ఇంట్లో ఉన్న హోమియోపతీ మాత్రలు మింగుతూ ఎన్నాళ్ళిలా రోగం కప్పెట్టుకుంటారు ?'

వదిన క్రిందకి వెళ్ళిపోయింది పరీక్షలు బాగా వ్రాసి అవి అయిపోయాయని గెంతులేస్తున్న నా మనస్సు ఒకసారి నిశ్చేష్ట అయిపోయింది.

పొద్దుట లేచి అన్నయ్యను పరీక్షగా చూశాను. అంతకుముందురోజు అలసటా నిద్రా బడలికల వల్ల వాణ్ణి సరిగా గమనించనే లేదు. ఎంత మారిపోయాడని ! ఆరు నెలల క్రిందట చూసిన మనిషికీ ఇప్పటి మనిషికి పోలికే లేదు. మానసికంగా బాగా క్రుంగిపోయినట్టూ, దైహికంగా అతి నీరసంగా ఉన్నట్టు స్పష్టంగా తెలుస్తోంది. కళ్ళూ, బుగ్గలూ గుంటలు పడ్డాయి. మెడమీది నరాలు ఉబ్బి భయంకరంగా ఉన్నాయి.

'అత్తా అత్తా కాశీలో ఏం వదిలి వచ్చావ్ ?' అన్నాడు ముకుందం నా ధోరణిలో పడి వాణ్ణి సరిగా గమనించనేలేదు. నిక్కరుతాళ్ళ ఖాళీల్లోంచి వాడి తెల్లని సాగినట్టున్న శరీరం కనిపిస్తోంది. కొంచెం ఎదిగేడు. 'నువ్వు నా కూడా వచ్చావేనా కాదురా, అక్కడ నిన్ను వదిలేసి వద్దును' అన్నాను. 'నిజం చెప్పాలంటే చదువుమీద భ్రాంతి పూర్తిగా అక్కడ వదిలేసి మరీ వచ్చానురా' అన్నాను మళ్ళీ.

'అదేమిటే, చదువంటే అంత మోహం మొత్తిపోయిందిటే ?' అనడిగాడు అన్నయ్య.

'అవును .... ఏవిధంగా ఎవరికీ ఉపయోగపడని చదువెందుకు ? అది సరే, నువ్వివాళైనా ఆఫీసుకెళ్ళే సూచనలు కనిపించవేం ?' 'ఇవాళ కూడా శలవేనా ?'

'అవును. నువ్వు శలవు పెట్టినన్నాళ్ళు ఆఫీసుకు శలవే. అర్థం పర్థం లేకుండా సోమవారం, మంగళవారం శలవంటే ఎవడు నమ్ముతాడు ?'

'లేదే, నా ఒంట్లో కొంచెం బాగులేదూ, అందుకని శలవు పెట్టేను. పూరికే వేళాకోళాని కన్నాను, నిన్ను ఏడిపిద్దామని.'

నా కళ్ళు నీళ్ళతో నిండేయి.

'అదేమిటే ?'

'నిన్ను ఏడిపిద్దామని' అన్నావుగా .... అదే యిది .... అదేగా నీ కోరికా ?'

వాడు నా చుబుకం పట్టుకుని తనవైపు తిప్పి పైకెత్తేడు. నా కన్నీళ్ళు యిక ఆగలేదు. కొంచెం సేపు అయ్యాక అన్నాను

'నువ్వు నిప్పులాంటి మనిషివని తెలుసు. నిజం తప్ప చెప్పవని తెలుసు. ఇన్ని అబద్ధాలు ఎప్పుడు నేర్చుకున్నావ్ ? ఇదెలాంటి నీతిమార్గం అనుకున్నావ్ ? 'సంసారం గుట్టు, రోగం రట్టు' అన్నారు. అలాంటిది భయంకరమైన వ్యాధిని లోలోపల కుళ్ళబెట్టుకుని నువ్వేం సాధించదల్చుకున్నావ్ ?'

అన్నయ్య మొహంలో ఆందోళనా, విచారమూ కొట్టొచ్చినట్టు కనబడ్డాయి. కొంచెం కోపం కూడా మిళితమైంది. అది తలుపువైపు ప్రసరించింది. అక్కడ నిలబడింది వదిన! 'మంగళా, ఇది నీ పనేనా ?' అన్నట్టున్నాయి ఆ చూపులు.

'వదిన నా కేదో చెప్పిందనుకుంటే అది పూర్తిగా పొరబాటు. ఇలాంటి విషయాలు కళ్ళతో చూసి గ్రహించవచ్చు. నువ్వొకసారి అన్నట్టు మావ రక్తంలోని వివేకశాతం తక్కువేం కాదు. నీ తెలివితేటలు మనుష్ముల్ని ఏమీ లేనట్టు బుకాయించడానికి ప్రయత్నిస్తే నా తెలివితేటలు నిన్ను పట్టియివ్వడానికి పనికివచ్చాయి. ఇందులో మూడోవాళ్ళ ప్రసక్తి ఏం లేదు !'

ఏమనుకున్నాడో ఏమో అన్నయ్యేమీ మాటాడలేదు.

'నూటరెండు డిగ్రీల జ్వరంతో నువ్వు ఆఫీసుకు వెళ్ళి పనిచేసుకురావడం నాకు గుర్తుంది.'

## సరపెంగలూ సన్నజాజులూ

ఈలు కుదిరే కూడా లెక్కచెయ్యక నె స్లైల్సా నువ్వు పూర్తిచేసుకోడం నాకు జ్ఞాపకముంది. ఎంత బాధో కాకపోతే ఎందుకిలా యింటిపట్టున ఉండిపోతావ్ ?'

'అబ్బబ్బబ్బా' అని అరచాడు అన్నయ్య చికాకుతో.

'కొద్దిగా, ఆయాసంగా ఉందనీ, మరేంలేదనీ ఎన్నిసార్లు చెప్పను ? ఎందుకు మనుషుల్నిలా విసిగించి వేధిస్తారు ? పోయేదానివి తిన్నగా పోక నిన్నెవ డిక్కడ దిగమన్నాడు ?' అని విసుక్కున్నాడు. నే నంతకన్న వూరుకోలేదు. నిశ్చయంగా దృఢంగా చెప్పేను.

'దిగడమే కాదు, ఇక్కడ ఉండిపోదల్చుకున్నాను, కూడా. చిన్నపిల్ల అది ఇబ్బందిపడితే పడుతుంది. ఆయనకీ కష్టంగా ఉంటే ఉంటుంది. ఏదైనా సరే నా కింతకన్న ముఖ్యంకాదు. నీ పట్టుదలేదో వదిలేదాకా నే నిక్కణ్ణుంచి కదలను. తగిలేస్తేవేమో తగిలెయ్యి, చూస్తాను'

'మంజూ, నన్నిలా కష్టపెట్టడం నా జబ్బు తగ్గించడం కాదుసుమా !'

'నువ్విలా కష్టపెట్టడం కూడా నీ జబ్బు తగ్గించడం కాదు సుమా ! నేనివాళ్ళే పెద్ద డాక్టర్ని పిల్చుకొస్తాను. నువ్వెందుకు పరీక్షించనియ్యవో చూస్తాను.

అన్నయ్య జవాబేమీ చెప్పకపోవడం నాకు మరింత ధైర్యాన్నిచ్చింది. ఆవాళే డాక్టరు పరీక్ష చేయించాను. జానకిరావ్ గారని ఆ యింటికి అవతలి వీధిలో ఉంది అతని ఇల్లు. ఎం. బి. బి. ఎస్. ప్రైవేటు ప్రాక్టీసు చేస్తున్నాడు. మా కందరికీ సంతుష్టి కలిగేలాగా చాలా నిదానంగానూ, వివరంగానూ పరీక్షించాడు.

'ప్రస్తుతానికి భయమేమీ లేదు గానీ వ్యాధేమో భయంకరమైనదే.'

'ఏం జబ్బు డాక్టరుగారూ ?'

'బ్లడ్ ప్రెషరూ, హార్ట్ వీక్నెస్సూ ఎక్కువగా ఉన్నాయి ప్రస్తుతం. 'హై పవర్ టెన్షనూ, హార్ట్ ఫెయిల్యూరూ' అనే రోగానికి దారితీయవచ్చు. కాంప్లికేషన్సు ఎక్కువగా ఇప్పుడేం లేవు. రోగం 'టర్నింగ్ పాయింట్' లో ఉంది. లభించే విశ్రాంతిమీదా, తీసుకునే ఆహారంమీద రోగి ఆరోగ్యం ఆధారపడి ఉంది. తేలికయిన ఆహారమూ, ఉల్లాసం కలిగించే కబుర్లూ రోగం మళ్లించడానికి తోడ్పడుతాయి. ఆ రక్తపుపోటు తీవ్రత తగ్గించాలంటే ఆహారంతో పూర్తిగా ఉప్పు విసర్జించాలి. 'సర్పాసిల్' అనే మందు ఇలాంటివాటికి బాగా పనిచేస్తోంది. ఆ మాత్రలు తెప్పించి పూటకి నాలుగు చొప్పున ప్రస్తుతానికి ఇవ్వండి. కనీసం ఒక నెల రోజులయినా ఆఫీసుకు శలవు పెట్టమని చెప్పండి. అన్నిటికన్న మానసిక విశ్రాంతి చాలా అవసరం. ఆయన్ని చూస్తే ఏదో తీవ్రమైన ఆవేదనతోనూ, ఆందోళనతోనూ తీసుకున్నట్టు కనిపిస్తారు. ఆర్థిక యిబ్బందులేవీ కాదు గద ?'

నేను ఉలిక్కిపడ్డాను. ఈ విషయమై ఇంత వరకు ఆలోచించనేలేదు. అన్నిటినీ మించి అన్నయ్య బాధపడుతున్నది డబ్బు లేకనే యేమో ! నే నెంత గుడ్డిదాన్నైపోయాను ! ఎంత ముఖ్యమైన విషయానికి ఎంత తక్కువ ప్రాముఖ్యత యిచ్చాను ! ఆ విషయం తరువాత వదిన్ని నిలదీసి అడిగాను. ఎన్నిసార్లు అడిగినా ఆమెనుండి ఒకేరకం జవాబు వచ్చేది. 'ఈ సంసారం సంగతి నీకు తెలియనట్లు కొత్తగా అడుగుతావేం మంజూ ! అతి సామాన్యమైన మధ్య తరగతి సంసారం యిది. పెద్ద పెద్ద ఆశలూ లేవు. చెప్పలేని ఖర్చులూ లేవు. లేనిపోని



కోర్కెలూ లేవు. తీర్చలేని అప్పులూ లేవు. ఒక నెలలో కాస్త అదనపు ఖర్చు అయితే ఒకటి, రెండు నెలలు ఇబ్బందిపడి దాన్ని తీర్చుకోవచ్చు. ఏమంత పెద్ద సంసారమనీ, మేం చూస్తే నలు గురం—ఇంతకీ ఈ గడ్డురోజుల్లో మాపాటి సుఖ పడ్తున్నవారు మాత్రం ఎందరు గనుక!'

ఇలాంటి జవాబు నాకేమాత్రమూ సంతృప్తి ఇచ్చేదికాదు. ఆఖరిసారి కదిపి చూస్తే ఆమెఅంది.

'మునుపయితే ఫస్టు తారీఖుకి ఇచ్చేసేవారు జీతాలు. ఇప్పుడు కొత్త ఆఫీసరు వచ్చాక తొమ్మిదీ పది తారీఖులకి గాని అందడంలేదు. అదీగాక ఈమధ్య ఈయన వంట్లో బాగుండక అస్తమానూ శలవులు పెట్టడంచేత అప్పుడప్పుడు జీతం నష్టం కూడా అవుతోంది. ఇవేం పెద్ద చెప్పుకోదగ్గ ఆర్థిక ఇబ్బందులేం కావు గాని ఏకంగా నెల శలవు పెట్టమంటాడా డాక్టరు. ఈయన ఏమంటారో —ఆ ఆఫీసరు ఏం ఇబ్బంది పెడ్తాడో!'

ఆరోజు నేనే ఆఫీసరు దగ్గరకు బయలుదేరి వెళ్ళి డాక్టరు అన్నయ్య విషయంలో చెప్పిన వివరాలన్నీ చెప్పి నెలరోజులపాటు లీవు ఇమ్మని ప్రార్థించాను.

'మీ నెమ్మది చూస్తే ముచ్చట వేస్తోంది. మీ అన్న కిందులో సగం అణకువ ఉన్నా ఎప్పుడో లీవు ఇచ్చిఉందును. లేనిపోని ఆవేశాలు పడి అనవసర విరోధం తెచ్చుకున్నాడు. పై అధికారులమీద రిపోర్టు ఇచ్చినపుడు ఈ జ్ఞానం ఉంటే ఎంత బాగుణ్ణు!'

'క్షమించండి. పాత విషయాలు త్రవ్వడానికిది సమయంకాదు. మీ రనుకున్నట్టు సంతకాలు లేకుండా అర్జీలు పెట్టుకునేంత అల్పుడు కాడు వాడు. ఎవరి మాటలో విని మీరు అంత తొందర పడ్డారు..'

'మీరు కూడా ఒకరి మాటలు విని నిర్ధారణ కొచ్చినవారే కద, నిజానిజాలు ఎవరికి తెలుసు!'

'ఇప్పు డవన్నీ ఎందుకు? నెలరోజులు ఒక అసిస్టెంటు మానేస్తే మీకు చాలా ఇబ్బంది అవుతుందని నాకు తెలుసు. కాని, ఏం చేస్తాం, కష్టాలు ఎవరికేనా వస్తాయి. జీతంలో కోత కూడా ఉంటే వాడి మనస్సు మరింత పాడవుతుంది. పదేళ్ళపైగా పనిచేస్తున్నాడు వాడు, అవసరం వచ్చినపుడు ఒక్క నెలరోజులు జీతంతో శలవు మంజూరు చెయ్యడానికి మీరు రికమెండ్ చెయ్యలేరా?'

'నేనేం చేసేదీ, ఆఫీసులో పని రద్దీగా ఉంది. అదిగాక ఆయన శలవంతా ఇదివరకే వాడేసుకున్నాడు. 'లాస్ ఆఫ్ పే'. ఇదివరకే అయింది. అందుకని ...' —

' .. అందుకని?'

'జీతం నష్టంమీద శలవు పెట్టుకోమనండి. శాంక్షన్ చేయిస్తాను.'

'గొప్ప పని చేస్తావు, అది నువ్వు చేసేదేమిటి?' అని మా అన్నయ్యయితే అనేసునేమో, నేను మాత్రం అనలేదు. చికాగ్గా ఇంటిమొహం పట్టేను ఇంటికి వచ్చేసరికి అన్నయ్యా, వదినా ఏదో ఘర్షణ పడుతున్నట్టు కనిపించారు. అన్నయ్య మొహంలో ఉద్రిక్తతా, వదిన మొహంలో నిస్సహాయతా స్పష్టంగా కనిపించాయి. నన్ను చూసి నెపం తెచ్చుకుని వెళ్ళిపోయింది. జబ్బు సంగతి నాతో చెప్పే వెందుకని వదినను అన్నయ్య నిలదీశాడేమో అనిపించింది.

ఏం జరిగిందో నే నడక్కుండానే అన్నయ్య 'ఏమే, ఏం చేసుకొచ్చావ్?' అని నన్నే అడిగాడు. నేను జరిగింది చెప్పేను.

'నేను ముందే చెప్పలేదా, కాగితంమీద రాసి ఏ బంట్రోతుచేతో పంపించేదానికి నువ్వు పని గట్టుకు వెళ్ళడం దేనికీ? నాకేదో పెద్ద ఉపకారం చేద్దామనుకుంటావ్, ఏమిటినువ్వు చేసేది? నీ మొహం, ఇదిగో ఇలాగే ఉంటుంది! నీకేమైనా తెలివితేటలుంటే నీ పిల్లని బాగుచేసుకో. నీ సంసారం చక్కదిద్దుకో.'

నేను తలవంచుకొని విచారంగా చూస్తున్నాను. అంతేనా, సంసారం చక్కదిద్దుకోడం సరే, అంతకు మించి ఆడదేమీ చెయ్యలేదా? ఎదుటివాళ్ళు కష్టంలో ఉంటే తనకు తోచిన సహాయం చెయ్యకూడదా? చెయ్యలేదా?

'ఎందుకే చీటికీ మాటికీ కళ్ళ నీళ్ళెట్టుకుంటావ్ మరేంపనీ పాటా లేదా ఏమిటి? అందుకనే ఆరోగ్యంగా ఉండాలంటే ఎప్పుడూ ఏదో పని కల్పించుకోమన్నారు. ఈరెండేళ్ళా చూడు చక్కగా

"నే నీ వాక్యం పూర్తిచేసిన క్షణంలో నువ్వు వచ్చి అబద్ధం చెప్పగలిగితే అయిదు రూపాయిలిస్తాను."

"అదేమిటయ్యా, పదిహేను ఇస్తానని పదికి తగ్గించావు ఇంతలో!"

వనజ (తాడేపల్లిగూడెం)

ఆ చదువు ధ్యాసలో పడి ఎంత ఆరోగ్యంగా ఉన్నావో!'

'ఓ! చాలా ఆరోగ్యంగా ఉన్నాను, చాలా సుఖపడ్డాను!' అనుకున్నాను.

'నీతోయిలాకాదు, మంగళా! ఆ అలమారలో పేకఉంది ఇలా అందుకో. నువ్వూ ఇలారా! ఓసే మంజూ ఇలాకూచుని పేక కలుపూ. ఐదుమూడు రెళ్ళు వెయి'

నేనూ, వదినా అన్నయ్యా ఓ పావుగంటసేపు పేక ఆడుతుంటే నాకు పెళ్ళికాకముందు మేం ముగ్గురం ఇలా గంటల తరబడి పేక ఆడిన రోజులు జ్ఞాపకం వచ్చేయి. పెద్ద పెద్ద ముక్కలు పడి కూడా దివాళా తియ్యడం అన్నయ్యకు సరదా. మే మిద్దరం పట్టుపట్టి కట్టుకట్టి వాడికి ఓ పట్టయినా వచ్చేలా చేసి ఓడించడం మాకు సరదా. అలాంటి రోజులు మళ్ళీ వస్తాయా అని నేనేకదు మేం ముగ్గురం ఎవరి మటుకు వాళ్ళం అనుకొని ఉండాలి. ఎవరికీ ఆటమీద ధ్యాస లేకుండా అలాగే యాంత్రికంగా ఆడేం. ఒంచుమించు మా బ్రతుకులు కూడా ప్రస్తుతం అలాగే ఉన్నాయేమో!

ఆ రాత్రి చాలా తల నొప్పిగా ఉండి పక్కింటి నిర్మలని తీసుకుని సినిమాకి వెళ్ళేను ఆ సినిమా చూడ్డంవల్ల మరింత తలనొప్పి ఎక్కువైంది. కేవలం ఈ తారక ఇలా సొంత ఇద్దామని ముందునుంచీ మనసులో పెట్టుకుని రాసిన సినిమా కధలు ఇలాగే ఉంటాయనిపించింది ఒక గయ్యాళి పాత్ర చాలా సినిమాలకు ఆయువుపట్టుగా ఉండడం సిగ్గుచేటనిపించింది. వచ్చేస్తూంటే దారిలో నిర్మలతో అన్నాను.

'చిన్నప్పుడే అమ్మా, నాన్నా పోతే పెన్నింతవాణ్ణి చేశాడు మా అన్నయ్య. ఇప్పుడు వాళ్ళు అన్నివిధాలా ఇబ్బంది పడుతూంటే ఏవిధంగా సాయం చేద్దామన్నా ఒప్పుకోడంలేదు నేనే ఏంగాకో వాళ్ళకేమైనా చేస్తే అది సహ్యమని అంగీకరిద్దురేమో! ఏం ఇబ్బందిలో ఉన్నారో అదైనా ఉన్న దున్నట్టు చెప్పరు. చేతగానితనంతో నా ఒళ్ళు మండిపోతోంది నిర్మలా!'

'వాళ్ళు పడుతున్న చికాకుల్లో, ఒకటి మాత్రం నాకు బాగా తెలుసు. ఎందుచేతంటే ఈ బాధ అంతో ఇంతో మేమూ అనుభవిస్తున్నాం గనక.' అంది చటుక్కున నిర్మల. కుతూహలంతో నా గుండె వేగం ఎక్కువైంది.

'అదేమిటి నిర్మలా, నాకు వివరంగా చెప్పవ్? అంతకంటె నాకు వేరే ఉపకారమేమీ ఉండదు. చెప్పు, చెప్పు'

నిర్మల ఆ సంగతి వివరంగా చెప్పింది. పెద్ద బజారులో ఉన్న రంగనాయకులు దగ్గిర నిర్మలా వాళ్ళ నాన్నగారు కూడా అప్పు చేశారట. అందుకని వాళ్ళ కన్నీ విశదంగా తెలుసట. అన్నయ్య ఋణం కూడా అతని దగ్గిరేనట

'వచ్చిన ప్రావిడెంటు ఫండ్ మొత్తంతో చాలా వరకు నాన్నగారు ఋణవిముక్తు లయ్యారు. పాపం మీ అన్నయ్యా వాళ్ళ అప్పే ఇంకా తీరలే దనుకుంటాను. ఇవాళ మధ్యాహ్నం నువ్వెక్కడికో వెళ్ళావ్, అవునా? అప్పుడా శెట్టి వచ్చి కూచున్నాడు. డబ్బే సర్వస్వం అనుకున్న వాడికి హృదయమేముంటుంది? ఏ పదిహేను రోజులకో ఒకసారి వచ్చి చిందులుతొక్కి వెడుతుంటాడు. ఎప్పటికప్పుడు ఇచ్చేద్దాం అనుకుంటారుగాని పాపం వాళ్ళకి మాత్రం ఎక్కణ్ణుంచి వస్తుంది? అందులో మీ అన్నగారికి ఈమధ్య తగని జబ్బు పట్టుకుందాయె మనుపటిరోజుల్లో, అసలు మనుషులు ఉన్నారా లేరా అన్నంత చల్లగా సాగిపోయేది వాళ్ళ సంసారం. ఇప్పుడు చిన్నచిన్న విషయాల్లో కూడా ఘర్షణ పడుతున్నట్టుంది'

'అప్పు మొత్తం ఎంతో నీకు తెలుసా నిర్మలా?'

'ఇన్నాళ్ళూ తెలియదుగాని, ఇవాళ 'ఒకటా, రెండా వడ్డీతో సహా వెయ్యి రూపాయలు పరక ఇవ్వాలి, ఎన్నాళ్ళని వూరుకుంటాను?' అని శెట్టి గట్టిగా అరుస్తూంటే మాకు స్పష్టంగా వినిపించింది. ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నారూ?'

'నిర్మలా! నీనోట భగవంతుడు నాకు సత్యం చెప్పించి కళ్ళు విప్పించాడు'

'మీ రంటున్నదేమో నా కర్థం కావడంలేదు. పైగా భయంగా ఉంది కూడా. నేనిలా ఈ విషయము మీతో చెప్పేనని ఎవరితోనూ చెప్పొద్దు. మా నాన్న చంపేస్తాడు.'

'అదే నీతో చెబుదా మనుకొన్నది. నాతో ఈ విషయం చెప్పేవని కూడా నువ్వెవరితోనూ చెప్పొద్దు. నువ్వు నా కెంత ఉపకారం చేశావో

నీ కిష్టమేదో చెప్పినా తెలీదు.'

ఆ రాత్రి తీవ్రంగా ఆలోచించాను, ఈ సమస్యను ఎలా పరిష్కరించడమా అని. నా మెడలోని నాలుగు పేటల చంద్రహారం అమ్మెయ్యడం తప్ప నాకు మరొక మార్గం గోచరించలేదు. 'ఆయన ఏమీ అనరుకదా ?' అని చాలాసేపు తర్కించాను. సరళ కాపురం సరిదిద్దే విషయంలో ఆయన చేసిన సహాయాన్ని జన్మలో మరచిపోలేను. 'ఒక మంచిపని చెయ్యడంలో ఒక యిల్లు చక్కదిద్దడంలో నీకు తోడ్పడ్డానంటే అంతకు మించిన ఘనకార్య మేముంది ?' అని ఆయన యిప్పటికీ నా చెవిలో అంటున్నట్టుంది. అలాంటివారు దీన్ని కాదంటారా ? పోనీ, మావూరు వెళ్ళి, ఆయనతో చెప్పి, అనుజ్ఞ తీసుకుని వస్తే ? అని మళ్ళీ అనిపించింది. ఇవన్నీ జరుగుతూ నా మెడలో వస్తువు అమ్ముతూంటే అన్నయ్య పూరుకుంటాడా ?

మనసు చాలా అల్లరి చిల్లరిది. మంచిపనులు చేద్దామని బుద్ధికి తోచటమే కష్టం అలా తోచిన తరువాత వీలయిన తొందర్లో కార్యరూపంలోకి మార్చడం మంచిది. మంచి విషయాన్ని మంచివాళ్ళు అన్నవాళ్ళు ఎప్పుడూ అడ్డు పెట్టరు. అడ్డుపెడితే ? వస్తే వస్తాయి కొన్ని చికాకులు సాహసం ఉన్న వాళ్ళకి దైవ సహాయం ఎలాగా ఉంటుంది.

కాని, వదిన కూడా ఎంత చిత్రంగా దాచింది! ఎన్నిసార్లు అడిగినా అంత తీర్చుకోలేని అప్పులేవీ లేవని కొట్టిపారేసిందే, యింతగా గుట్టుగా ఉంచడాన్ని ఆమె ఎక్కడ నేర్చుకుందని ?

సార్థకమైన పేరు సర్వమంగళ ! ఆ పద్యం జ్ఞాపకం తెచ్చుకుందామని ప్రయత్నించాను. కాని ఒక్క ఆఖరి చరణం తప్ప తక్కినవి జ్ఞాపకం రాలేదు. 'మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో' ఓహో, ఈ వాక్యమే ఒక కావ్యం ! దీని అర్థమేమిటి ? విషమైనా తన భర్త నేమీ చెయ్యలేదని నమ్మకమా ? భర్త ఏపని చేసినా అందులో పొరపాటు ఉండదనే వెనుదీయని విశ్వాసమా ? దైవశక్తిమీద ఉన్న ప్రగాఢమైన గౌరవమా ? పద్యం పూర్తిగా రానందుకు చాలా బాధపడ్డాను. పెళ్ళినాడు అన్నయ్య యిచ్చిన భాగవతం అలాగే ఉంచేశాను. అందులో ఎన్ని స్కంధాలు చదివేనని ? నన్ను నేను తిట్టుకున్నాను పరీక్షలయి పోయాయి కనుక యిక ముందైనా భారత భాగవత రామాయణాలు చదవాలి. అక్కడక్కడ కాదు. పూర్తిగా. సంపూర్తిగా.

నిర్మలనే మళ్ళీ రమ్మన్నాను, మర్నాడు ప్రొద్దున ఆమె ఒకపట్టాన ఒప్పుకోలేదు. ఎవరితోనూ చెప్పనని ఎన్నో ఒట్లు వేయించుకున్నాక ఒప్పుకుంది. మధురిమకి ఏవో గౌన్లు కొంటానని వంకపెట్టి బయలు దేరేను.

'కాశీ వెళ్ళి గాడిదగుడ్డు తెచ్చేనని అక్కణ్ణుంచి ఉత్తి చేత్తులో వచ్చి యిక్కడ పిల్లకి గౌన్లు కొంటున్నావా? ఎంతకైనా తగుదువే!' అన్నాడు అన్నయ్య. 'అవును. ఎంతకైనా తగుదును' అనుకున్నాను మనసులో. 'నేనూ వస్తాను ఒక్కక్షణం ఆగవమ్మా' అంది వదిన.

'అలాగలాగే నీపనులన్నీ అయేసరికి దుకాణాలుండొద్దూ? ఇవాళ సాయంకాలానికేనా ఊరికి బయలు దేరాలా, ఒద్దా? మీకేం? ఈపాటికి ఆయనక్కడ ఏ 'కథాకళి' లో ఉన్నారో! పద నిర్మలా యింకా ఆలశ్యం దేనికి?'

సం పెరగటూ సన్న జాజులూ

మేము వెళ్ళే సరికి అదృష్టవశాత్తు మార్వాడీ బంగారు షాపులో నే ఉన్నాడు. ఆట్టే జనం లేరుకూడా. వచ్చిన పని చెప్పేసరికి సవాలక్ష ప్రశ్నలు వేశాడు. పాత బంగారమనీ, ఇప్పుడు పట్టుకుంటున్నారనీ చాలాసేపు రేటు తేలనివ్వాడు కాదు సేటు. మొత్తంమీద గీటువేసి తూకంవేసి పదకొండు వందల ఇరవై నాలుగు రూపాయల పావలా ఇచ్చేడు. అంత సొమ్మూ తీసుకుని రుమాలులోవేసి బిగించి కడుతుంటే నా వేళ్ళు ఒణికేయి అక్కణ్ణుంచి అలా రంగనాయకులు షాపుకి వెళ్ళి వడ్డీతోసహా అప్పు పూర్తిగా తీర్చేసి రసీదు పుచ్చుకున్నాము. తరువాత రెడీమేడ్ షాపుకి వెళ్ళి మధురిమకు నాలుగు గౌన్లూ సీతకి రెండు గౌన్లూ ఇద్దరికీ జోళ్ళూ తీసుకున్నాను. వస్తూ మందుల షాపులో నర్వాసిల్ మాత్రలు ఒకనెల రోజులకి సరిపడేవి పుచ్చుకుని ఇంటిదారి పట్టేం.

'ఏలాగో అలా అప్పు తీర్చేరు. బాగానే ఉంది ఈ సంగతి మీ రిప్పుడుదాస్తేమాత్రం ఎల్లకాలం దాగుతుందిటండీ? ఇంతకీ ఇంటికి వెళ్ళగానే ఈ కబురు బావగారికి చెబుతారా చెప్పరా?'

ఇవే సరిగ్గా నా మనసు నన్నడుగుతున్న ప్రశ్నలు కాని నా అంతరాత్మ జవాబు చెప్పే స్థితిలోలేదు.

ఒక [illegible]

ఆలోచించకుండా బినాసరే— చేసినందువల్ల గలిగే మధురమైన భావనతో అది పరవశించిపోతున్నది. 'ఒక్క సత్కార్యంచేసే సద్బుద్ధిని ప్రసాదించావు. దానివల్లవచ్చే కష్ట నష్టాలకు తట్టుకునే ధైర్య స్థైర్యాలు కూడా యియ్య దయామయా!' అని అనుకున్నాను.

నేను తెచ్చిన రసీదూ, ఒక లేఖా గుచ్చి కవరులోపెట్టి అంటించి అన్నయ్య టేబిలుమీద పెట్టి రైలెక్కేయి. ఆ లేఖలో ఇలా రాశాను.

నీకేరా ఈ ఉత్తరం—అన్నా!

ఇవ్వడమేగాని పుచ్చుకోడం ఎరగవా?'

అలా అవతలివాళ్ళు కూడా అనుకుంటే అప్పుడేం జరుగుతుందో ఊహించవా?

మనసిచ్చి పుచ్చుకోవడంతో నీ, నా అని భేదం లేనంత ప్రాణప్రదురాలైన సోదరిని నీకు నేనైతే ఇందులోఉన్న రసీదును సాదరంగా స్వీకరించు.

చీరలూ నగలూ ఇవేకాక చిన్నప్పట్నుంచీ మంచి బుద్ధులు కూడా ఇవ్వడం నువ్వు చేసిన మహా పాపమైతే స్వయంకృతాపరాధానికి సద్దుకుని సహించు.

ఎలాగైనా నన్ను దీవించు.

అందుకైనా పదికాలాలపాటు జీవించు.

ఇంకెవరు వ్రాయుగలరు నీ కిలాటి ఉత్తరం?

నేనే—నీ మంజుల. ( సశేషం )



"..... మొన్ని మధ్య మా ఆఫీసులో ముగ్గురు గుమాస్తాలు సెలవు పెడితే—ఇం క్రిమెంటు యిస్తారని ఆశపడి—ఆ ముగ్గురి పనీ నేనే చేసేశా! తీరా చూస్తే—మా బాస్, ఆ ముగ్గురినీ తీసిపారేసి—ఆ పని నన్నే చెయ్యమన్నాడు! అంతే !! ....."

# తిరునల్లారు శని దేవాలయం

ఫొటోలు, వ్యాసం:
ఎన్. రామకృష్ణ





ఈ నలతీర్థం ప్రక్కనే ఉన్న బావిలోకి భగవంతుడు నలమహారాజు స్నానానికి గంగను తీసుకొచ్చాడని ప్రతీతి.

శనికిమాత్రం గుడి ఉండటం అరుదు. శనిని తలుచుకుంటే మాత్రం భయమే! సాధారణంగా నవగ్రహాల విగ్రహాలు అన్ని దేవాలయాలలోనూ ఉంటాయి. పూజలన్నీ అక్కడే జరుగుతాయి. కొన్ని చోట్ల నవగ్రహాలలో కొందరికి దేవాలయాలు ఉన్నాయిట; కానిశని దేవతకిమాత్రం ఒక గుడి, సన్నిధి చాలా అపురూపం; తిరునల్లారులోని గుడి ఎంతో పెద్దదికూడా.

తిరునల్లారు కరైకాల్ సమీపంలో ఉంది. నేడు భారతదేశంలో కలిసిపోయిందికాని ఒకప్పుడు ఇక్కడికి వెళ్లాలంటే ఎన్నో నిబంధనలు అడ్డు వచ్చేవి……

**నవగ్రహాలలో ముఖ్యుడైన శని పేరు చెప్పగానే భక్తితోబాటు భయం కూడా కలుగుతుంది. అయినప్పటికీ శనికి దేవాలయం వుండటం అపురూపం. తమిళనాడులో కరైకాల్ సమీపంలో వున్న తిరునల్లార్‌లో శని దేవాలయానికి ఒక విశిష్టత వున్నది. అందుకు సంబంధించినవే యీ వ్యాసం, ఫొటోలూ....**

ప్రతి ఏడూ తిరునల్లారులో "శని పెయర్చి" అనబడే ఉత్సవం జరుగుతుంది. ఇది తమిళ కొత్తసంవత్సరాదినాడు వస్తుంది. నలదమయంతి కథ తెలియనివారుండరు. నలుడు శని బాధలు తప్పించుకొనటానికి తిరునల్లారు వచ్చి నలతీర్థంలో స్నానం చేశాడుట. అప్పటినుంచి, నలుడుకూడా అక్కడ గుడిలోనే తన నివాసం ఏర్పరచుకుని, నల నామస్మరణం చేసేవారిని బాధించనని తీర్మానం చేసుకున్నాడుట. ఈ సందర్భంలోనే వేలాది ప్రజలు అక్కడచేరి నలతీర్థ స్నానాలు, మంచినూనె దీపాలు వెలిగించడాలు, శనిపూజలు కావిస్తారు. శనిదశ జరుగుతున్నవారు ఇక్కడికి వచ్చి ప్రత్యేకంగా పూజిస్తారుట.

తిరునల్లారులోని ముఖ్య దేవాలయాన్ని దర్భారణ్యేశ్వర దేవాలయం అంటారు. శని సన్నిధి దర్భారణ్యేశ్వరాలయ ప్రాకారం లోపలేఉంది. పాత పురాణాలలో దీనికి 'నలేశ్వరం' అనే పేరువాడారు.

శని వాహనం కాకి. అందుచేత ఊరేగింపులకి వెండికాకి అమ్ముతారు. ఈమధ్య శని విగ్రహానికి బంగారు కవచంతొడిగారు.

తిరునల్లారు వెళ్లాలంటే, మయూరం రైల్వేస్టేషన్‌లో దిగి రైలు మారవచ్చు, లేదా బస్సులో వెళ్లవచ్చు. ★



తిరునల్లారులోని ఈ దేవాలయంలో శనికి ప్రత్యేకమైన ఆలయం ఉన్నది.



నలమహారాజు శనిని వదిలించుకోడానికి స్నానంచేసిన కొలను. ప్రజలిక్కడ అభ్యంగన స్నానాలు చేస్తుంటారు.

# వైజ్ఞానిక గాథాశతి

## 9

### డాక్టర్




ప్రాంరణమేమిటో తెలియదుగాని 1667 సంవత్సర ప్రాంతంలో న్యూటను టెలిస్కోపు — అనగా దూరదర్శనిని ఇంకా ఉపయోగించేటట్లు చెయ్యడానికి యత్నించాడు. దూరదర్శనిలో ఉపయోగించే కటకము(Lenses)ల వంపులు నిర్దుష్టముగా చేసే ఉద్యమంతో 'ఎంత నాభ్యంతరము (Focal Length) ఉన్నదానికి ఎంత వంపు ఇవ్వాలి అని లెక్క చేసి, ఆ వంపులతో కటకములు అరగదీసి తయారు చేశాడు. ఎలాంటి కటకము చేసినా, అది సూర్యరశ్మిని ఒకే ఒక బిందువు దగ్గరకు కేంద్రీకరించలేకపోయింది ఒకటీ, అలా కేంద్రీకరించబడిన బొమ్మ అయినా, రంగులు రంగులుగా తయారైందికాని రంగులు లేకుండా కానరాలేదు. రెండూ లోపాలు తేలేయి.

న్యూటను మహా మేధావి. కటకములను శుద్ధి చెయ్యడముతో తెగని చిక్కు కటకమువల్ల కలగడము లేదు కాబోలని ఊహించి వెల్తురును పరిశీలించాడు. కటకము రెండు పార్శ్వాలూ బల్లపరపుగా ఉంటే రంగులు ఎలా విడతాయో చూడాలని కటకముకాక పట్టకము తీసుకుని, కిటికీ తలుపు లోని కన్నములోనుంచి గదిలో ప్రవేశించిన సూర్య కిరణాన్ని పట్టకంలోనుంచి పోయేటట్లు చేశాడు.

'ఎ—లో' అంత మేరకి రంగుల మచ్చపడింది. 'ఎ' దగ్గర ఎరుపు, 'లో' దగ్గర నీల లోహితమూ (Violet) పడ్డాయి. అంటే, 'రం' అన్న రంధ్రమంత మేరలో ప్రవేశించిన వెల్తురు 'ప' అనే పట్టకములో ప్రవేశించి మార్గ వక్రతతోడు విస్తరణమునకు (Dispersion) లోనైనది. ఇలాటి విస్తరణమువల్లనే కటకములో నుంచి వెళ్ళిన వెల్తురు ఒకే బిందువు దగ్గర పడలేదు.

న్యూటను ఈ వింతని వెంట తరిమేడు. విస్తరణము ఎక్కడ జరుగుతోందో తెలుసుకోడానికి 'తెర'ని పట్టకానికి దూరంగా తీసి కెళ్ళాడు. దూరము రెట్టింపైతే, రంగుల మచ్చ రెండు రెట్లైంది. అంటే ఏమన్నమాటా? వెల్తురు పట్టకాన్ని విడిచిన తర్వాత విస్తరణ జరగలేదన్నమాట. విడడము ఎంతమాత్రము జరిగిందో పట్టకంలోనే జరిగింది ఆ తరవాత వెల్తురు తిన్నగా పోవడములో రెండు రెట్లు దూరమున్న తెరమీద రెండు రెట్ల పొడవు మచ్చ, మూడు రెట్లు దూరంలో మూడు రెట్లు పొడవుమచ్చ తయారయాయి. అంటే వెల్తురుని విడదీయడము పట్టకము పనే అన్న మాట. తెలుపు వెల్తురుని ఏడు రంగులు, (VIBGYOR) రంగులుగా విడ దీసిందన్నమాట. ఎరుపు రంగుని ఇంకా విడదీస్తుందా పట్టకము?

తెరకు ఎరుపురంగు పడినంత మేర రంధ్రము చేసి ఆ ఎరుపురంగు కిరణాల్ని ఇంకొక పట్టకము లోంచి పంపి, దానిలోంచి బయటపడ్డ కిరణాల్ని మళ్ళీ తెరమీద పట్టేడు. దారివక్రతే ఎక్కువైందికాని ఎర్ర కిరణాల రంగులు మరి విడలేదు. అంటే, తెల్లని వెల్తురులో ఏడు రంగుల కిరణాలున్నాయనీ, పట్టకము వాటిని విడదీసిందనీ అర్థము.

అయితే ఏడురంగులూ చేరితే తెలుపు ఏర్పడుతుందా? ఇందాకటి పటములో పట్టకము ప్రక్కను ఇంకొక సమాన పట్టకమూ పెట్టినట్లైతే విడిపోయిన రంగులు చేరిపోయి తెల్లని వెల్తురు తెరమీద పడింది!

రంగు వెల్తురు గుణము. తెల్ల వెల్తురులో ఏడు రంగుల కిరణాలు చేరి ఉన్నాయి. ఒక అట్ట సిబ్బిమీద ఏడురంగులూ—ఇందాకటి 'ఎలో' వర్ణ చిత్రములో అవి ఉన్న పాళ్లలో పూతపెట్టి ఆ సిబ్బిని గిరగిర తిప్పించాడు న్యూటను. రంగులు కాక తెలుపు కనపడింది!

రంగు వెల్తురు గుణము. అయితే వస్తువు గుణము ఏమిటీ? దానిమీద పడేదేమో అన్ని రంగులూ చేరిన తెలుపు కణాలే. దానినుంచి వచ్చేది మాత్రము ఎరుపో, పసుపో, నీలమో, ఏదో అవుతోంది. అంటే వస్తువేమి చేస్తోందన్నమాటా?




అన్ని రంగుల కిరణాలూ తనమీద పడితే అన్ని రంగుల్నీ పీల్చేసి, ఒక్క రంగు కిరణాల్నే మళ్ళీ పంపుతోందన్నమాట. ఎరుపు వస్తువు ఎర్రగా ఎందుకు కనబడుతోందీ? అది ఎరుపుని మట్టుకే మళ్ళీ పోనిస్తున్నది కనక. తక్కిన రంగుల్ని పీల్చేస్తోంది.

తెల్లని వెల్తురు కటకంలోనుంచి పోయేటప్పుడు ఏడు రంగులూ, ఏడు మార్గాలలో మళ్ళి సాగిపోతున్నాయి. కనక అవి ఒకే బిందువు కడ కేంద్రీకృతముకావు ఇది వెల్తురు గుణము, కటకము లోపమేమికాదు.

అయితే దూరదర్శని మాటేమిటీ? న్యూటను తన ఉద్యమాన్ని వదిలేశాడా? ప్రజ్ఞానిదులు ప్రారంభించి పరిత్యజించరు. పుటాకార దర్పణము (Concave Mirror) తెల్లని కిరణాల్ని తన నాభి (Focus) దగ్గర కేంద్రీకరింపజేస్తుంది. దాన్ని పట్టేడు న్యూటను. సూర్యుడు అతి దూరములో ఉన్నాడు కనక సూర్యుడినుంచి మనకువచ్చే కిరణాలు సమానాంతరములే. నక్షత్ర ములనుంచీ, గ్రహముల నుంచీ వచ్చే వెల్తురూ సమానాంతరమే. పుటాకార దర్పణము వాటి వైపు తిరిగినప్పుడు ఖగోళాల వెల్తురు దానిమీద పడి దాని నాభి (Focus)




దగ్గర కేంద్రీ కృతమౌతుంది. అంటే నాభిదగ్గర ఆ ఖగోళబింబము యొక్క బొమ్మ ఏర్పడుతుందన్న మాట. 'నా'భికి ముందు సమతలదర్పణ శకలమును (Piece of Plane Mirror) అమరిస్తే 'నా' వద్ద కలియబోయే కిరణాలు మళ్లి 'బిం' దగ్గర కలుస్తాయి. అంటే ఖగోళ బింబము 'బిం' దగ్గర పడుతుంది. భూత అద్దముతో దానినిపెద్దదిగా చూడవచ్చును. వట్టి కంటికి కనపడే దూరపు వస్తువు బొమ్మకంటె ఈ సాధనమువల్ల ఎన్ని రెట్లో పెద్ద బొమ్మ కనపడుతుంది. అంటే ఇదీ దూరదర్శినే అన్నమాట. గెలీలియో నిర్మించిన సాధనములో ఖగోళాల వెల్తురు కటకములోంచి పయనించి కేంద్రీకృతమైతే, న్యూటన్ దూరదర్శినిలో ఆ వెల్తురు వక్ర దర్పణముమీద పడి వెనక్కి మళ్ళి కేంద్రీకృతమౌతుంది. అది వక్రీభవ (Refraction) దూరదర్శినీ, ఇది పరావర్తన (Reflection) దూరదర్శనీని.

న్యూటన్ చేసిన మొదటి పరావర్తన దూరదర్శిని ఒక్క అంగుళము వ్యాసమున్న వక్రదర్పణముతో చేసినట్టిది. ఆరంగుళములు మాత్రమే పొడవు అది. గురుని ఉప గ్రహాల్ని కనపరిచింది. కాంతి సేకరణ సామర్థ్యము దానికి ఎక్కువ. ★

# పోటిలేనిది —

## నాణ్యతకైనా సరే, ధరకైనా సరే!



ఈ నేషనల్-ఎక్కో మాన్‌సూనైజ్డ్ రేడియోల యొక్క ధరలు, డిజైను, ప్రత్యేకాంశములు మరియు పనితనమును యితర రేడియోలతో పోల్చి చూడండి. నేషనల్-ఎక్కో రేడియోలే మీ డబ్బుకు తగిన విలువనిస్తాయని మీరే అంటారు. ఈ రేడియోలు ఉష్ణదేశములలో ఉపయోగమునకై ప్రత్యేకముగా తయారు చేయబడ్డాయి. వీటి భాగములకు ప్రత్యేకమైన రక్షణ యివ్వబడింది. కనుక యీ రేడియోలు పాడవకుండా ఏళ్ల తరబడి బాగుగా పనిచేస్తాయి, మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో డీలరువద్ద వీటిని నేడే వినండి !

**మోడలు 806 :**
6 వాల్వులు, 3 వేవ్ బ్యాండులు.
సొగసైన కఱ్ఱ క్యాబినెట్. మోడలు యు-806 ఎసి/డిసి సెట్, మోడలు ఎ-806 ఎసి సెట్.
రు. 396.00

ధరలలో ఎక్సైజ్ డ్యూటీ చేర్చబడినది; పన్నులు అదనము

# నేషనల్ ఎక్కో

## మాన్‌సూనైజ్డ్ రేడియో








**మోడలు యు-819 :**
ఎసి/డిసి. సెట్. 5 వాల్వులు, 3 వేవ్ బ్యాండులు. ప్లాస్టిక్ గ్రిల్‌గల సొగసైన బేక్‌లైట్ క్యాబినెట్.
రు. 298.00

**మోడలు ఎ-829 :**
ఎసి సెట్. 6 వాల్వులు, 4 బ్యాండులు. అందమైన బేక్‌లైట్ క్యాబినెట్. పుష్‌బటన్ టోన్ కంట్రోలు. పియానో కీ స్విచింగ్.
రు. 481.00

**మోడలు ఎ-786 :**
ఎసి సెట్. 6 వాల్వులు, 5 వేవ్ బ్యాండులు. అందమైన కఱ్ఱ క్యాబినెట్. రొటేటింగ్ ఫెరైట్ ఏరియల్. పియానో కీ స్విచింగ్.
రు. 575.00

జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్ బొంబాయి . కలకత్తా . పాట్నా . మద్రాసు . బెంగుళూరు . ఢిల్లీ . సికిందరాబాదు



# ప్రజాజీవి

అశ్విని

టైగర్‌కు మానవుల నర్థం చేసికోటం అంత బాగ చేతకాదు. అది కొన్ని కొన్ని తనకు సుపరిచిత మైన మాటలను విని అర్థం చేసికోగలదు. "కమ్ హియర్ టైగర్" "హలో టైగర్" "ఇజా టైగర్" వంటి మాటలు దానికి సుపరిచితాలు. 'కమ్ హియర్ టైగర్" అన్నప్పుడు పడుకున్నదల్లా ఎగిరి తోకాడించుకుంటూ పిలిచిన వాళ్ళ దగ్గరకి వచ్చేది. అయితే దాని సంగతి తెలిసిన ఇతరు లెవ్వరూ పిలవటానికి సాహసించరు. అది సుపరి చితమైన కంఠాల్ని గుర్తుపట్టి దగ్గరకొచ్చి నిల్చుంటుంది. ఇతరులు పిలిచారా వాళ్ళ అంతు చూస్తుంది. అలా ఈ "రాక్షసి కుక్క" చేతిలో అనుభవంపొందిన వాళ్ళు చాలమంది వున్నారు

దాని జీవితంలో ఇంతవరకు ప్రతి అమూల్య క్షణం ఇక్కడే ఈ ఇళ్ళమధ్యనే గడిచిపోయింది. ఇక ముందుకూడ ఇక్కడే గడపాలని దాని ఆశ. అది ఇక్కడే పుట్టి పెరిగింది. దాని తలితండ్రు లెవరో తెలియదు. అది పుట్టింది ఇంజనీరు గారింట్లో. అది పుట్టగానే గోధుమరంగుతో నిగనిగలాడే దాన్ని చూసి ఎవరో 'టైగర్' అని నామకరణం చేశారు. అదిదాని సార్ధక నామమైంది. పెరిగింది వారి ఉప్పు తిని. అందుచేత దాని రక్తంలో వారి ఉప్పు కలిసిపోయింది. అదే విశ్వాసమై ఇప్పటికీ దాని రక్తనాళాల్లో ప్రవహిస్తూనే ఉంది.

ఇంజనీర్‌గారి కుమార రత్నాలు 'కమాన్ టైగర్' అని పిలిచినప్పుడల్లా చెంగున ఎగిరి దగ్గరకు వెళ్ళేది. వాళ్ళు సరదాగా పిలిచినప్పుడు అది సరదాగా ఉండేది. ఒక్కొక్కప్పుడు సరదాగా కోపం తెచ్చుకునేది. వాళ్ళు పిలవగానే, తను మోస పోయి పిలవగానే వెళ్ళానని అనుకోవాలని దాని వూహ. అలా అనుకుని అది నవ్వుకునేది. ఈ పిచ్చి మానవులు ఎప్పుడు తెలివిన బడతారా అని ఆలో చించేది.

ఇంజనీరుగారి కొడుకులు, కూతుళ్ళు అలా ఎన్నోసార్లు దాన్ని పిలిచేవాళ్ళు. వాళ్ళ దగ్గర పెట్టటానికి ఏమీ లేవని తెలిసినా కావాలని ముందు రెండు కాళ్ళు ఎత్తి వాళ్ళ వంక చూసేది. అదోవిధమైన ధ్వని చేస్తూ మొరిగేది. ముందు రెండు కాళ్ళతో వాళ్ళ చేతుల్ని తడిమేది. వాళ్ళ జేబుల్లో కూడా ఉంటుందని తెలుసు దానికి. జేబులవంక కూడ చూసేది. కుర్చీ చుట్టూ తోకా డించుకొంటూ తిరిగేది. క్రింద రెండు కాళ్ళమీద నిల్చుని ముందు కాళ్ళను పైకి క్రిందకి ఆడించేది. అప్పుడు దాని గొంతులో నుండి ఆనందంతో కూడిన అరుపు వెలువడేది. దాని గొంతులో నాదం జగద్వ్యాప్తమయ్యేది

అది సాధారణంగా ఇంటిని విడిచి ఎక్కడికి వెళ్ళేది కాదు. ఈ పిచ్చి మానవుల జాగ్రత్తమీద దానికి నమ్మకంలేదు. ఎప్పుడైనా సాయంకాలం పూట ఒకసారి అలా ఎదురుగుండా ఉన్న కమీష నరుగా రింటికి, లేదా ప్రక్కనే ఉన్న డాక్టర్‌గా రింటికి పోతూఉండేది. డాక్టర్‌గారి కుక్క టామీకి టైగరంటే ఎక్కడలేని భయం. అయితే టైగర్ దాన్ని ఎప్పుడూ ఏమీ అనలేదు. పై పెచ్చు దాన్ని చాల స్నేహభావంతో చూసేది. అది ఏమీ తెలియని అమాయికపు పిల్ల అని టైగర్ భావం. పాపం, ఏమీ తెలియనిది. ఎట్లా బ్రతుకుతుందో" అని నిట్టూర్చేది.

కమీషనర్‌గారి భార్య అంటే దానికి ఓ విధ మైన యిష్టం. అది గౌరవం కూడ కావచ్చు దానికి కారణం లేకపోలేదు. ఆవిడ దానికి, తమ కుక్క రాణితో పాటు ఆదరంతో అన్నం పెట్టేది ప్రేమగా 'టైగర్' అని పిలిచేది. తనమీద సాను భూతి చూపే వ్యక్తిమీద ఎవరికి గౌరవముండదు? అంచేత కమీషనర్‌గారి భార్య వాకిట్లో ఎప్పుడు కనిపించినా అది తోకాడిస్తూ దగ్గరకు వచ్చేది. ఆవిడ్ని తన భాషలో పలకరించేది. ఆవిడ వేసే ప్రశ్నలకు తనకర్ధమైనట్లే జవాబులు చెప్పేది ఎప్పుడైనా ప్రక్కనేవున్న గ్రౌండ్‌లో రాణితో పాటు తిరిగి వచ్చేది. విశ్వాసం ప్రకటించటం దాని జాతి లక్షణం.

ఈ చుట్టుప్రక్కల రాజ్యానికి అది మకుటం లేని రాజా. దానికి ఎదురు తిరిగి బ్రతుకగల కుక్క ఈ ప్రాంతంలో లేదు. అది ఎలాంటి దురా క్రమణని సహించదు. దాని పరాక్రమాన్ని చవి చూసిన శునకాలు ఎన్నో వున్నాయి. అందుచేత సాధారణంగా ఈ ప్రాంతానికి మరో శునకం రాదు. దాని క్రూర కరాళ దంష్ట్రాలలోపడి నెత్తురు కారే దేహంతో ఎదుగెత్తటం వాటి కిష్టం లేదు. ఒక వేళ ఏదైనా క్రొత్త కుక్క ఈ ప్రాంతానికి ఒద్దామనుకున్నా అనుభవం పొందిన కుక్కలు వాటికా విషయం చెప్పి ఆ ప్రయత్నంనుండి విర మింప చేసేవి. దాని అనుగ్రహం పొంది కొలువులో చేరిన కుక్కలు బహుకొద్ది. దాని విశ్వాసాన్ని చూరగొన్న కుక్కలు రెండే రెండు. కమీషనర్‌గారి కుక్క రాణి. డాక్టర్‌గారి కుక్క టామి. రాణి మరీ ప్రాణప్రదమైంది తనకీ రాణికి ఉన్న ఈ "స్నేహాన్ని" అది అక్షరాలా ఆచరణలో పెట్టింది. కమీషనర్‌గారిని, ఇంజనీర్‌గారితో సమానంగా గౌర వించింది. ఆమాటకు వస్తే అది ఇంకా ఎక్కువగా కమీషనర్‌గారిని ప్రేమించింది. కమీషనర్‌గారి పిల్లలు గ్రౌండులో క్రికెట్ ఆడుతుంటే అది రాణితో సహా వారిని వెంబడించేది వారికి రక్షణగా వారి చుట్టూ తిరిగేది. మరో కుక్క కనిపిస్తే మాత్రం దాన్ని వూరి పొలిమేరల దాకా తరిమి వచ్చేది కాని లేకపోతే ఆ ప్రదేశాన్ని విడిచేది కాదు. ఈ విషయంలో రాణి దానితో సహకరించేది. రాణిని మరో కుక్క కన్నెత్తి చూస్తే సహించేది కాదు రాణిమీద సర్వాధికారాలు తనవైనట్లు ప్రవర్తించేది.

కమీషనర్‌గారు గాని, కొడుకులుగాని బజారు నుంచి వస్తుంటే వాళ్ళకి ఎదురుగా వెళ్ళి స్వాగతం చెప్పటం టైగర్‌కు ఉగ్గుపాలతో పెట్టిన విద్య. లేనప్పుడు రాణికి రాజకీయాలు చెప్పేది మన 'ఆహార సమస్య', 'వియత్నాం' పరిస్థితి, చైనా

దురాక్రమణ—అన్నీ దానికి తెలుసు. ఈ రెండేళ్ల నుంచి రేడియోలో న్యూస్ వినటం అలవాటు చేసుకుంది. ఉదయం 7 గం. కి రాత్రి 7 గం.క అది రేడియోముందు కూర్చునేది. యుగయుగాల భారతీయాత్మ దానిలో ఆవేశించింది నలభై నాలుగు కోట్ల భారతీయుల సమస్యలు దానికి కావలసి వచ్చాయి.

ఎప్పుడైనా కమీషనర్ గారింట్లో టైగర్‌మీద కోపం వచ్చి గేటు మూసివేస్తే అది గేటు కటకటాలలో తలపెట్టి జాలిగా చూసేది పళ్లతో కటకటాలను కొరకాలని చూసేది. మధ్యలో ఉన్న కంతలో తల దూర్చి జాలిగా అరిచేది. గేటు తీయించటానికి రాణిని గేటుదాకా పిలిచి మంతనాలాడేది. బయటకు వచ్చిన ప్రతి నారితో గేటు తీయించమని తన భాషలో చెప్పేది.

రోజు రాత్రిపూట అది ఆరు బంగళాల మధ్యలో పడుకునేది. చీమ చిటుక్కుమన్నా లేచి చీకట్లో చూపుల సూదులు గుచ్చేది కాని కన్ను మూసేదికాదు. దాని భయంకరమైన అరుపు విని ఆ ప్రాంతాలకి ఎవరూ వచ్చేవాళ్లు కాదు రాత్రి డ్యూటీకి వచ్చే పోలీసులకు కూడ అదంటే భయమే. రోజూ వచ్చే గూర్ఖా దాని అరుపు విని 'మహారాజ్ రాం రాం' అని పరుగు పెట్టేవాడు.

అందుచేత దాని నిత్య పాలనకి అడ్డు అనేది లేకుండా పోయింది.

* * *

సూర్యబింబము గర్భంలో ఉన్నందువల్ల తూర్పు దిక్కు పావురాల కూతలతో ప్రసవవేదన పడుతోంది. టైగర్ బద్దకంగా లేచి ఒళ్లు విదిలించుకుని ఇంజనీర్‌గారింటికి బయలుదేరింది ఇంట్లో అంతా బిజీగా కనిపించారు. రోజు మాదిరిగా ఎవరూ దాన్ని 'హలో టైగర్' అని విష్ చేయలేదు. రోజు లభించే బిస్కట్లు ఈరోజు లభించలేదు దానికి ఇంజనీరుగారి ఆఖరి కుమార రత్నం కమల్‌కు స్నేహం వాడు అది ఇంట్లోకి వచ్చిన తరువాత పుట్టాడు. వాడు అస్తమానం టైగర్‌తో ఆడుకునేవాడు. అలాటివాడు కూడ దాన్ని చూడలేదు. చూసినా పలకరించలేదు వాడి స్వంత ఆస్తులైన బొంగరం, గోలీలు, బంతులు, బొమ్మల పుస్తకాలు సంచీలో సర్దుకోటంలో నిమగ్నుడైనాడు. ఇంజనీరుగారి భార్య పెట్టెలు సర్దుతూంది. టైగర్ తలెత్తి నిశితంగా చాల సేపు చూసింది. ఇక పలకరించరని తెలిసాక తనే [illegible] చుట్టూ ఒకసారి తిరిగి తన భాషలో '[illegible]ంగ్' అంది —దాని మొరుగు విని ఉలిక్కిపడి వెనక్కి చూసింది. తన ప్రయత్నం ఫలించినందుకు టైగర్ ఆనందించింది అయితే ఆవిడ విష్ చేయటానికి బదులుగా "పోవే బాబు, కాసేపు వాకిట్లోకి పో. మా కడ్డంరాకు." అని కసురుకుంది

టైగర్‌కి ఆ మాటలు అంతగా బోధపడక పోయినా ఆ భావం గ్రహించింది. అయినా దానికి ఆగ్రహం రాలేదు. మామూలుగా ఉండే చిరాకే ననుకుంది. వాకిట్లోకి వచ్చి ఆ చోటులో కదలకుండా పడుకుంది.

ఇలాంటి మానావమానాలు ఎన్నో అది సహించింది. "పెట్టిన చెయ్యే కొడుతుంది" ని దానికి తెలుసు అప్పుడప్పుడు వారి సరదా కోసరం పెద్ద దెబ్బలే తిని బాధపడింది. అయినా అప్రయత్నంగా వచ్చిన కన్నీటిని వాళ్ల నవ్వుతో కలిపి ఆనంద భాష్పంగా మార్చుకుంది.

అలా ఎంతోసేపు పడుకోలేదు. ఓసారి ఇంటి చుట్టూ తిరిగి వచ్చింది. రోజులాగ లేదు ఇల్లు. ఈరోజు ఇల్లు తల్లక్రిందులుగా కనిపించింది దానికి.

"టైగర్ ! కమాన్ టైగర్" యజమాని మాటలు అమృతం చిలికినయి దాని గుండెల్లో.

ఒక్క ఉరుకులో పరుగెత్తుకుని వచ్చింది. యజమాని ప్రక్కన మరో మనిషి కూడ ఉన్నాడు. దురదృష్టమేమిటంటే టైగర్‌కి పేపరు చదవటం రాదు. వచ్చిఉంటే ఈరోజు దాని నక్షత్రంలో నమ్మినవారి నుంచి ద్రోహం అని చదివి ఉండేది.

యజమానిని చూసి తోకాడిస్తూ నిల్చుంది.

"ఆఁ, వచ్చావా, ఒరే చిట్టి ఏది గొలుసు."

చిట్టి అనబడే ఆఖరి కుమార రత్నం మనసులు కట్టుకున్న బంధాన్ని త్రెంపటానికి ఇనుపగొలుసు తెచ్చాడు.

యజమాని గొలుసు మెడలో బెల్టుకు తగిలిస్తుంటే ఆనందంగా మెడ నందించింది.

వాళ్ళిద్దరూ మాట్లాడుతూ బయలుదేరారు.

తరువాత యజమాని చేతిలో గొలుసు కొత్తాయన చేతిలోకి మారింది.

యజమాని వెనుదిరిగాడు. టైగర్ కంగారు పడింది. భయంకరంగా మొరిగింది.

యజమాని టైగర్‌ని చూసి "గుడ్‌బై టైగర్" అని వెళ్లిపోయాడు.

టైగర్ శక్తి ఉన్నంతవరకు అరిచింది. కొత్తాయన మీదికి దూకింది. రక్కటానికి ప్రయత్నించింది అయితే వీపుమీద దెబ్బలమీద దెబ్బలు పడటంతో వెనక్కి తగ్గింది.

క్రొత్తాయన ఓ వ్యాపారస్తుడు. ఈమధ్య ఆయన దుకాణంలో ఓ దొంగతనం జరిగింది. ఆయన టైగర్ ప్రశస్తి విన్నాడు. దాన్ని కొన్నాడు. సరిగా అదే సమయంలో ఇంజనీర్‌గారికి ట్రాన్స్‌ఫర్ కావటం టైగర్ దురదృష్టం. ఈ సంగతులు దానికెవరు చెబుతారు ?

కాని దాని ఊహ నిజం ! తనని అమ్మే హక్కు ఇంజనీరుగారి కేముంది ? కేవలం వాళ్లింట్లో తిన్నందుకు కావలి కాస్తోంది. తను ఆ యింటికి చెందుతుంది కాని, అందులో మనుష్యులకు కాదు. అయినా అది ఇంజనీరుగారిని ద్వేషించలేక పోతున్నది. దాని కోపమల్లా ఆ కొత్తాయన మీదనే. సందు దొరికితే ఆయన్ని చీల్చివేయాలని చూస్తున్నది అయితే ఆయన ప్రతిసారి చేతిలో హంటర్‌తోనే కనిపించాడు.

ఆపూట అది వాళ్ళు పెట్టిన అన్నం తినలేదు. దానికి ఓ వ్యక్తిత్వం ఉంది. దానికి అహం ఉంది అది అందరు పెట్టిన అన్నం తినదు. దానికి ఉచ్చ నీచలు తెలుసు. ఆకలితో బాధపడుతూ ప్రతిక్రియ ఆలోచించింది ఇంజనీరుగారి అబ్బాయితో తన ఆటలు తలుచుకుని ఏడ్చింది ? మళ్లీ ఎప్పుడు అలా రాణితో గ్రౌండులో తిరగటం ? మళ్ళీ ఎప్పుడు ఆ ఆరో బంగళాలమధ్య పడుకుని అరవటం ?

ఇలా ఆవేశం ఎక్కువైనకొద్దీ ఆకలి ఎక్కువైంది. ఆకలి ఎక్కువైనకొద్దీ ఆవేశం ఎక్కువైంది. విపరీతమైన బలంతో విజృంభించి గుంజుకుంది. మెడకున్న బెల్టు గొలుసునుండి విడిపోయింది. ఒక్క పరుగులో వీధిలో పడింది. దాన్ని పట్టగల శక్తి అక్క డెవరికీ లేకపోయింది.

అది సరాసరి ఇంజనీర్‌గారింటికి పోయింది. కాని, అంతకన్నా వేగంగా దురదృష్టం దాన్ని వెంటాడింది. ఇల్లు తాళం పెట్టిఉంది. అది అరుస్తూ తాళం పట్టుకుంది. తాళం వెక్కిరిస్తూ నవ్వింది. టైగర్ తెలుసుకుంది యజమాని లేడని. గృహం శూన్యమైందని. టైగర్ స్టేషన్‌కి పరుగెత్తిపోయింది.

సరిగా అదే సమయానికి రైలు బయలుదేరుతోంది. టైగర్ అరుస్తూ పిచ్చిగా, ఆత్రంగా ఓమూల నుంచి ఈమూలకి పరుగెత్తి రైలు పెట్టెలన్నీ చూసింది.

"అదిగో టైగర్" అంటున్నాడు చిట్టి.

టైగర్ చూసింది. ఆనందంతో అరిచింది.

రైలు వెనకే పరుగెత్తింది.

చిట్టి దాన్ని చూసి చెయ్యి వూపుతున్నాడు. కాని ఎంతోసేపు అలా పరుగెత్తలేకపోయింది.

దేవుని సృష్టి మానవుని సృష్టిని అతిక్రమించలేక పోయింది. అది రైలుకన్న వెనకపడింది. రైలు కనుచూపుమేర దాటిపోయింది.

అది గుండెలు పగిలేలా రోదిస్తూ నిలుచుంది. దాని మనస్సులో ఎన్నో భావాలు. ఏమిటి వంచనకి ఇప్పుడేం చేయాలి ? కొత్తాయన యింటికి పోవటం యిష్టంలేదు దాని దృష్టిలో కమీషనర్‌గారు మెదిలారు. అవును. తను పోగొట్టుకున్న ఆదరణ అక్కడ లభించవచ్చు.

అది వెనక్కి తిరిగి బయలుదేరింది.

కాని అక్కడ కొత్త యజమాని నిలబడి ఉన్నాడు

అది నిర్ఘాంతపోయింది. పారిపోదా మనుకుంది. దాని కాళ్ళలో శక్తి చచ్చిపోయింది.

ఆయన చేతిలో హంటర్ ఉంది ప్రతిఫలం దానికి తెలుసు దానికి తల వంచే ఉంది. గొలుసుకు బెల్టు తగిలించే లాక్కుపోయినాడు క్రూరముగా. టైగర్‌కి పోక తప్పలేదు. ఇంత కఠిన శిక్షకి తను ఏ తప్పు చేసింది ?

ఈ లోకంలో దాన్ని రక్షించటానికి ఏ '[illegible]' పుట్టలేదు. అది విధికి కట్టుబడి పోయింది.

దాని గుండెలో పరాభవాగ్ని రగుల్కొన్నది.

"జాగ్రత్తగా కట్టెయ్యిరా ! మళ్లీ పోతుంది." ఎవరో అంటున్నారు.

"ఈసారి పోతేనా ?"

ఈ మాటలు టైగర్‌కి అర్థంకాలేదు కాని యజమాని క్రూరమైన చూపు దానిగుండెని చీల్చివేసింది అది దాని జీవితంలోని అర్థాన్ని పరమార్థాన్ని దహించివేసింది. కొన్ని కలలకి రూపమేకాని అర్థముండదు. ఇది అలాటిదే.

దాని బాధ ఒకటే !

కనీసం రాణి అయినా తను వెళ్లేటప్పుడు చూడలేదు. కాని, దానికేం తెలుసు ? ఈ సమయంలో

తన అంశ ఆరు విభాగాలు చూసి నూతన ప్రాణి లను సృష్టించిందని ?

టైగర్ ఈరోజు పూర్తిగా ఓడిపోయింది.

దాని అంతర జగత్తులో యుద్ధం తీవ్ర మైంది. కొత్త యజమాని టైగర్‌ని తీసుకుని బయలుదేరాడు తన స్వంత వూరుకి. ఆయ న్ననుసరించక తప్పలేదు దానికి. అయితే అది యిష్టంతో కాదు. పాత యజమానిని అనుస రించినట్లుగా కాదు. మధ్య మధ్య ఎదురుతిరిగి

## ఆశాజీవి

రెండు దెబ్బలు తిన్నది. దాని కళ్లవెంబడి అశ్రుపుష్పాలు భూదేవిని పూజిస్తున్నాయి. బహుశ పాత యజ మానికి తన మార్గం చూపిస్తున్నదేమో ?

అయినా దాని గుండెల్లో ఆశ. అది తలెత్తి చూస్తూనే ఉంది పాత యజమాని కోసరం. ఇది కలగా తీసికుని తృప్తిపడటం చేతకావటంలేదు



దానికి. మానవుడు తన దురదృష్టాన్ని విధి మీదకి నెట్టి తృప్తిపడ్డాడు.

దానిలో చైతన్యం లేదు. దానికి ఉనికి లేదు. ఆశల ఆకులన్నీ రాలిపోగా మోడైన వృక్షము దాని జీవితం. అది జీవితంలో స్థిరత్వాన్ని ఏనాడో కోల్పోయింది. దాని ఆత్మలోంచి ఒక ఆర్తనాదం వెలువడి జగద్వ్యాప్తమైపోయింది. దాని గుండెల్లో రైలు చప్పుడు ఇంకా వినబడుతూనే ఉంది. క్షణక్షణానికి వాళ్లిద్దరి మధ్యదూరం ఎక్కువైతూనే ఉంది.

అయినా ఆశ హిమాలయం వంటిది. దాని తోనే అది ముందడుగులు వేసింది. కాలపు టిసుకపై దాని చరిత్ర పాద చిహ్నాలు పడుతున్నాయి.

రాణి సంగతి తెలిసినా అది తృప్తిపడేదేమో ?

ఒక్కసారి దాని జీవితం సున్నం కొట్టిన సమాధి అయింది. దాని కర్మబీజం దగ్ధమైంది.

దాని గొంతులోంచి ఆర్తరవాలు ప్రకృతిని నిగ్గదీస్తున్నాయి. ప్రకృతి జీవంలేని నవ్వు నవ్వింది. అది కుక్కగా జన్మించినప్పుడే దాన్ని మరొకరికి బానిస చేశాడు భగవంతుడు. దానిమీద దానికి లేని హక్కు మానవుల కుంది. అది న్యాయాన్యాయా లను, మానావమానాలను స్వీకరించక తప్పదు. అయితే దాని అహం ఎదురు తిరుగుతూనే ఉంటుంది. దానికి బలం లేదు. మానవుడి నిరంకు శత్వానికి బలియైపోయిన ఓ జీవి. అది తల్ల క్రిందులైనా మానవుడు దానవుడు కాగా వాడి చేతిలో ఓ అల్పప్రాణి.

ఇలా అన్ని కోణాలలోంచి తన జీవన వీణని తీగెలు తెంచివేస్తుందని దానికేం తెలుసు ?

మానవుడు దేవుడు కాకపోయినా దానవుడు కాకుండా తన స్మృతిని కాల పుటల మీద నుంచి చెరిగిపోకుండా నిలుపుకుని మానవుడుగానైనా మర ణిస్తాడని అనుకుంది టైగర్. కాని, మనిషిని మనిషే మనిషిగా చూడని ఈ కాలంలో తనని సరిగా చూడగలడని, తన ఉనికిని గుర్తించగలడని అనుకోవటమే టైగర్ చేసిన తప్పు. అందుకే అతన్ని వెర్రిగా నమ్మింది. ఈరోజు మానవుడు తల్లక్రిందులుగా నడుస్తున్నాడని దానికి తెలి యదు.

అయినా దానిది మొండి ప్రాణం. దానికి బ్రతుకుమీద ఆశ ఉంది.

ప్రకృతి విధించిన ఈ దారుణ శాపాన్ని వరంగా మార్చమని మాత్రమే అది దేవుణ్ని ప్రార్థించింది.

అప్పుడప్పుడు సడిలేని నడిరేయి ఆకాశంలో మెరిసే నక్షత్రాల వంక చూస్తుంటే దానికి దిగులు ఆవరించేది. దాని గొంతులో నుండి వేదనా భరితమైన నాదం ఆవిర్భవించి దిగ్వ్యాప్తమై పోయేది. ★

# వేల్పులకైనా మార్పులు తప్పవు

## విష్ణువు



మహేష్

(గత సంచిక తరువాయి)

కృష్ణుని ప్రసిద్ధాయుధం చక్రం. కృష్ణుడు చక్రంతో శిశుపాలుడు మొదలైన శత్రువులను సంహరించినట్లు చెప్పబడుతుంది. చక్రం ఆయుధంగా ఉపయోగింపబడుతున్నట్లు వేదాల్లో చెప్పలేదు. బుద్ధుని కాలానికి చక్రాన్ని ఆయుధంగా వాడడం ఆగిపోయింది. అందుచేత కృష్ణుడు క్రీస్తుకు పూర్వం ఎనిమిది పది శతాబ్దాల మధ్య ఉండవచ్చునని ప్రొఫెసర్ డి. డి. కోశాంబి అభిప్రాయం ఇందుకు సాక్ష్యంగా మీర్జాపూరు జిల్లాలోని గుహా చిత్రాన్ని వారు ఉదాహరిస్తున్నారు. ఈ చిత్రంలో రెండు గుర్రాలులాగే రథంమీదనుంచి ఒక యోధుడు చక్రాన్ని ప్రయోగిస్తున్నట్లు చిత్రించబడింది

విష్ణువు కృష్ణరూపంలో భూమియందు ఉండగా కలి భూలోకమున ప్రవేశించలేక పోయెను అనియు, కృష్ణ నిర్యాణానంతరము కలియుగము ఆరంభమైనదనియు సనాతనుల విశ్వాసం. మన శాస్త్రాల ప్రకారం ఈ సంవత్సరం కలియుగంలో 5065వ సంవత్సరం కావడంవలన క్రీస్తుకు పూర్వం 3100 సంవత్సరాలకుముందు కృష్ణునికాలమై ఉండవలెనని వీరి అభిప్రాయం.

మహా భారత యుద్ధంతో కృష్ణునకు అతి సన్నిహితమైన సంబంధం ఉన్నది. మహా భారతయుద్ధం ద్వాపర యుగాంతంలో జరిగినది అందుచే మహాభారత వృత్తాంతం కూడా కృష్ణుడు క్రీస్తుకు పూర్వం 3100 సంవత్సరాలకుముందువాడై ఉండవలెననే అభిప్రాయాన్ని బలపరుస్తుంది. ఆధునిక చరిత్రకారులు కొంతమంది మహాభారతయుద్ధం క్రీస్తుకుపూర్వం 1733 వ సంవత్సరంలో జరిగినదనియు మరికొంతమంది క్రీస్తుకుపూర్వం 1810వ సంవత్సరంలో జరిగినదనియు, మరికొంతమంది క్రీస్తుకుపూర్వం 1922 వ సంవత్సరంలో జరిగినదనియు అభిప్రాయపడుచున్నారు.

కేవలం వాసుదేవ కృష్ణుడే కాకుండా వృష్ణి వంశానికి చెందిన మరికొంతమంది వీరులు కూడా పూజింపబడుచున్నట్లు మధురవద్ద ఉన్న మోరా లోని శిలా శాసనంలో చెప్పబడింది. రోహిణీ వసుదేవుల పుత్రుడైన సంకర్షణుడు, దేవకీ వసుదేవుల తనయుడైన వాసుదేవుడు రుక్మిణీవాసుదేవుల పుత్రుడైన ప్రద్యుమ్నుడు, జాంబవతీ వాసుదేవుల పుత్రుడైన సాంబుడు ప్రద్యుమ్న కుమారుడైన

అనిరుద్ధుడు పూజించబడుచున్నట్లు వాయు పురాణంలో చెప్పబడింది. ఇదే చతుర్వ్యూహ సిద్ధాంతానికి కారణం అయింది. ఈ సిద్ధాంతం వైష్ణవ మతంలో వివరించబడుతుంది.

## గోపాల కృష్ణుడు

గోపాలకుడైన కృష్ణుని గురించి పతంజలి ఏమీ చెప్పలేదు. నారాయణీయంలో కంసవధ మాత్రం ఉన్నదికాని మిగిలిన వృత్తాంతాలు ఏమీ లేవు. హరివంశంలోను, వాయు పురాణంలోను, భాగవతంలోను కృష్ణుని బాల్య వృత్తాంతం ఉన్నది. లాటిన్ పదమైన ది నేరియస్‌నుంచి వచ్చిన పదం "దీనారం" హరివంశంలో ప్రయోగించబడింది కాబట్టి ఇది క్రీస్తు తర్వాత మూడవ శతాబ్దంలో రచింపబడి ఉండవచ్చునని శ్రీ భండార్కర్ అభిప్రాయం. మహా భారతంలోని సభాపర్వంలో శిశుపాలుడు, కృష్ణుని బాల్య వృత్తాంతాన్ని పేర్కొని నిందించినట్లు ఉన్నదికాని దానికి సమాధానంగా భీష్ముడు చేసిన స్తుతిలో కృష్ణుని బాల్య వృత్తాంతం పేర్కొనబడలేదు. కాబట్టి ఇది దరిమిలా చేర్చబడి ఉండవచ్చును.

మహా భారతంలో గోవిందుడు అనే పదం తరచుగా ప్రయోగింపబడింది కాని. భూమిని కనుగొన్నవాడు అనే అర్థంలో ఈ శబ్దం ప్రయోగించబడినట్లుగా ఆదిపర్వంలో చెప్పబడింది. అందుచేత మహా భారతంయొక్క ముఖ్య కథా రచనా కాలానికి కృష్ణుని బాల్య వృత్తాంతం ఇప్పుడు భావించినట్లుగా ఉండకపోవచ్చును. క్రీస్తు తర్వాత మొదటి శతాబ్దంలో భారతదేశానికి వలస వచ్చిన అభీరులనే తెగ, తమతో ఇక్కడకు తీసికొని వచ్చిన దేవతా బాలుని వృత్తాంతమే కృష్ణుని బాల్య వర్ణనలకు కారణం అయిఉండవచ్చునని కూడా శ్రీ భండార్కర్ అభిప్రాయం.

ద్రావిడుల ఆకాశ దేవత అయిన "విన్" వేదాల్లో వర్ణించబడిన విష్ణువు, నారాయణుడనే ఋషి, వృష్ణి వంశజుడైన వాసుదేవకృష్ణుడు, ఇక్కడకు వలస వచ్చిన జనులు తమతో తీసికొని వచ్చిన దేవతా కథలు, ఇవి అన్నీ కలిసి నేటి విష్ణుదేవతా భావనకు దారితీసినాయి. అని చాలామంది చరిత్రకారుల అభిప్రాయం.

## నారాయణోపనిషత్

ప్రాణము, మనస్సు, సర్వేంద్రియములు, పృథివ్యప్తేజోవాయ్వాకాశములు, బ్రహ్మ రుద్రేంద్ర ప్రజాపతులు, ఆదిత్యులు, రుద్రులు, వసువులు మొదలైన దేవతల నారాయణుని సంకల్పము వలన జన్మించి, నారాయణునియందే ఉండి, నారాయణునియందే లీనమగుచున్నారు. బ్రహ్మ శివ శుక్రాది సర్వ దేవతా స్వరూపుడైన నారాయణుడు, నిష్కళంకుడు, నిరంజనుడు, నిర్వికల్పుడు, నిరాఖ్యాతుడు, అద్వితీయుడు. నారాయణాష్టాక్షరీ మంత్ర క్రమం ఫలితం కూడా ఇందులో వివరింపబడినాయి.

## రామరహస్యోపనిషత్

రాముడే పరబ్రహ్మ, రామషడక్షరీ మంత్ర మహాత్మ్యము ఇందులో వర్ణింపబడింది. ఋషి దేవతా చ్ఛందో ధ్యానముల మంత్రములతో సహా శ్రీరామ మంత్రము యంత్రము మొదలైన వాటిని గురించి ఇందులో వివరింపబడింది.

## వాసుదేవోపనిషత్

గోపీ చందన పూర్ధ్వపుండ్ర ధారణాక్రమం, మహాత్మ్యం వర్ణింపబడినాయి. గోపీ చందనము లభించకపోయిన ఎడల తులసీ మూలమందున్న మృత్తికను ధరించవలెను. గోపీచందనము ధరించుటవలన సర్వ పాతకముల నుంచి విముక్తి లభించుచున్నది. సర్వతీర్థ స్నానఫలం, సర్వయజ్ఞ ఫలం నారాయణునియందు అచంచలమైన భక్తి, జ్ఞానం, విష్ణుసాయుజ్యం గోపీచందన ధారణవలన కలుగుచున్నది.

## కలిసంతరణోపనిషత్

కలియుగమందు మానవుడు, నారాయణ నామోచ్చారణ మాత్రము చేతనే తరించుచున్నాడు. అత్యంత ప్రచారములోవున్న "హరేరామ, హరే కృష్ణ" నామములు ఇందులో చెప్పబడినాయి. ఈ నామోచ్చారణకు ఏ విధమైన విధిలేదు. సర్వ కాలములందు ఈ నామస్మరణ చేయుటవలన సర్వ పాపములనుంచి మానవుడు తరించగలడు.

## హయగ్రీవోపనిషత్

ఋగ్యజుస్సామవేద స్వరూపుడును, వాగేశ్వరుడును అయిన హయగ్రీవుని ఏకాక్షర, త్ర్యక్షర, పంచాక్షర, షడక్షర, సప్తాక్షర మంత్రములు వాని మహాత్మ్యము వర్ణించబడినాయి. ఈ మంత్రము వలన శ్రుతిస్మృతి పురాణేతిహాస జ్ఞానం సర్వైశ్వర్యం కలుగుచున్నాయి. అహంబ్రహ్మాస్మి తత్త్వమసి మొదలైన మహా వాక్యములచేత ప్రతిపాదింపబడిన అర్థమునే ఈ ఉపనిషత్తు కూడా ప్రతిపాదించుచున్నది.

## దత్తాత్రేయోపనిషత్

దత్తాత్రేయ షడక్షరీ, అష్టాక్షరీ, ద్వాదశాక్షరీ, షోడశాక్షరీ మంత్ర వివరములు జప మహాత్మ్యం వర్ణించబడినాయి. దత్తాత్రేయుడు, స్మరణ మాత్ర సంతుష్టుడు, మహా భయ నివారణుడు, మహాజ్ఞానప్రదుడు, బాలోన్మత్త పిశాచవేషుడు, మహాయోగి, సర్వకామ ఫలప్రదుడు అని వర్ణించబడింది.

## కృష్ణోపనిషత్

సచ్చిదానంద లక్షణుడును, సర్వాంగ సుందరుడును అయిన రామచంద్రుని చూచి వనవాసులయిన మునులు విస్మితులు కాగా వారి ప్రార్థనను అంగీకరించి మహా విష్ణువు కృష్ణుడై అవతరించెను. మాయా విగ్రహ ధారణుడైన హరియే గోప రూపుడైన కృష్ణుడు, ముక్తికాంతయే యశోద, పరమానందమే నందుడు, శేషుడే బలరాముడు, గోకులమే వైకుంఠము, రుద్రుడే వేణువు, మునులే గోపికలు, దయయే రోహిణి, శమమే సుదాముడు, సత్యమే అక్రూరుడు, దమమే ఉద్ధవుడు, కలియే కంసుడు, ద్వేషమే చాణూరుడు, మత్సరమే ముష్టికుడు, దర్పమే కువలయాపీడము ఈవిధముగా కృష్ణావతార తత్త్వము ఇందులో వివరించబడినది.

## తారసారోపనిషత్

తారకార్థము ఇందులో వివరించబడింది. ఓం అను అక్షరమే ఆత్మ స్వరూపము. నమ అను రెండక్షరములు ప్రకృతి స్వరూపము. నారాయణాయ అను అయిదక్షరములు పరబ్రహ్మ స్వరూపము. ఇందులో ఓంకారము బ్రహ్మ అగుచున్నది. నకారము విష్ణువు, మకారం రుద్రుడు, నకారం ఈశ్వరుడు, రకారం విరాట్, యకారం పురుషుడు, ణకారం భగవానుడు, యకారం పరమాత్మ అగుచున్నది. ఈవిధంగా అష్టాక్షరీ మంత్రం వివరించబడుచున్నది. పురాణ పురుషోత్తముడు, నిత్య శుద్ధ బుద్ధ ముక్త సత్య పరమానందానంతాద్వయ పరిపూర్ణుడైన పరబ్రహ్మమే రాముడు, కలాతీత భగవతియే సీత, కలా పురుషుడే లక్ష్మణుడు, శంఖము భరతుడు, చక్రము శత్రుఘ్నుడు మొదలైన వివరణలతో రామావతార తత్త్వము వర్ణించబడింది.

## త్రిపాద్విభూతి మహానారాయణోపనిషత్

ప్రథమాధ్యాయంలో పాద చతుష్టయ స్వరూప నిరూపణం చేయబడింది. అవిద్యాపాదం, సువిద్యాపాదం, ఆనందపాదం, తురీయపాదం అని నాల్గు పాదాలు. విష్ణువు నివాస స్థానాలు మూడు. వైకుంఠం, క్షీరసముద్రం, సూర్యమండలం. రెండవ అధ్యాయంలో పరబ్రహ్మంయొక్క సాకార, నిరాకార స్వరూప నిరూపణ చేయబడింది. మూడవ అధ్యాయంలో మూల విద్యా ప్రళయ స్వరూప నిరూపణం, నాల్గవ అధ్యాయంలో మహా మాయాతీత అఖండ, అద్వైత, పరమానంద లక్షణములు కలిగిన పరబ్రహ్మయొక్క పరమ తత్వ స్వరూప నిరూపణం చేయబడ్డాయి. అయిదవ అధ్యాయంలో సంసార తరణోపాయ కథనం ఆరవ అధ్యాయంలో పరమ మోక్ష మార్గ స్వరూప నిరూపణం, ఏడవ అధ్యాయంలో త్రిపాద్విభూతి పరమ వైకుంఠ మహా నారాయణ యంత్ర స్వరూప నిరూపణము, ఎనిమిదవ అధ్యాయంలో పరమ సాయుజ్య ముక్తి స్వరూప నిరూపణం కావించబడినవి. 

# అపస్వరం

మూలం త్రివేణి

అనువాదం శర్మాజీ

## జరిగిన కథ

తల్లిదండ్రుల్ని కోల్పోయి అనాథైన మీరను పెదనాన్న క్రిష్ణయ్యగారు చేరదీస్తారు. చదువులోనూ యితర విషయాల్లోను ఎంతో చురకుగా ఉన్న మీరకు పెదతల్లి ఆటంకం ఏదురౌతూ ఉంటుంది కొన్నేళ్ళు గడుస్తాయి మీర అన్న గోపి డాక్టర్ పూర్తి చేస్తాడు. మీర కూడా కాలేజిలో చేర్తుంది తను కూడా డాక్టర్ చదవాలనుకుంటుంది. రాధ, గోపాలం దంపతులవుతారు. శామ్, మీరలు పరస్పరం ఆకర్షించుకొంటారు. శాముతో మీర వివాహం జరిగిపోతుంది. మీర అత్తవారింటికి వెళుతుంది. కానీ లోలోపల డాక్టరవ్వాలనే కోరిక బలవత్తరమవుతుంటుంది. శ్లైటూరి వాతావరణం మీరకు గిట్టదు. అయినా తన సంసారాన్ని దిద్దుకోవటమే తన కర్తవ్యమని మనసును సరిపెట్టుకునేందుకు ప్రయత్నిస్తుంది. ఇంటర్‌మీడియేట్, ఫస్టు క్లాసులో ప్యాసయినట్టు తెలియగానే తన గత స్మృతులన్నీ మీరను వ్యాకులపరుస్తాయి. కాలక్షేపం కోసం గ్రామీణ స్త్రీలకు విద్యాబోధన చెయ్యాలని అనుకుంటుంది మీర.

## 9

ఆ రోజు సాయంత్రం నీలమ్మ మొగుడు కాస్త పెందరాళే ఇంటికొచ్చాడు. అతని తల్లి గుడిసె ముందు కూర్చొని, రాగులు బాగుచేస్తూంది కాస్త దూరంలో వీధి కుక్కొకటి పడి పొర్లుతూంది. ఏడెనిమిది కోళ్ళు గుడిసె చుట్టూ తిరుగుతూ పురుగులను ఏరి తింటున్నాయ్. కెంచమ్మ అప్పుడప్పుడూ వీధివేపు చూస్తూ కోపంతో ఏదో గొణుక్కొంటూ, చేటలోని రాగులు చెరుగుతూంది.

అడుగుల చప్పుడు వినపడగానే, కోపంగా "నీలీ" అని పిలిచింది. శివయ్య దగ్గరగా వచ్చి "నేనమ్మా. నీలి ఇంకా రాలేద్మా ?" అని అడిగాడు.

ఇంతవరకూ లోపలే అణచుకొన్న ముసలిదాని కోపం కట్టలు తెంచుకొంది. చేతిలోని చేట క్రింద కుక్కి లేచి నుంచుంది.

"శివా, మంచి పిల్లనే కట్టుకున్నావు గదరా" అంది. ఆమె తెల్లటి వెంట్రుకల దరి ఉన్నాయి. శివయ్య ఆశ్చర్యంతో తల్లివేపు చూస్తూ "ఏటి జరిగిందమ్మా" అన్నాడు. అలసటతో అతనికి నీరసంగా ఉంది. ఉదయం నుండి పొలంలో కష్టపడి పనిచేసి, అతని దేహం విశ్రాంతికోసం అలమటిస్తోంది. చిరునవ్వుతో ఎదురై, ఉల్లాసాన్ని కలిగించే నీలి బదులు కోపంతో రెచ్చిపోతూన్న, తల్లిని చూసి మరింత నీరసపడిపోయాడు శివయ్య.

తల్లి పక్కలో కూర్చొంటూ "ఏంటయిందో సెప్పమ్మా" అన్నాడు.

"ఇంకా ఏటి కావాల ? పొద్దుండగానే, శామప్ప గోరింటికి పోనాదిగందా. ఈపాటికి రానేదు ఆడేం యెలగబెడుతూందో నాకేటి తెలుసు. నేనో ముసలి ముండను సావకుండా ఉండాను గందాని . పిల్లది ఏడిసి ఏడిసి, కళ్ళు తేలేసినాది ఇదేం కాపురం సేయడాని కొచ్చిందేనాంట? . .మేతకు పోయిన గేదె ఎటుపోయినాదో తెల్దు. ఇటు పిల్లదాన్ని సూడనా. అటు గేదెకోసం లగెట్టనా ? కూడొండనా? ఏటి సెయ్యమంటావు ?"

కొడుకుమీద విరచుకుపడింది కెంచమ్మ. అసలే అలసటతో ఇంటికొచ్చిన శివయ్యకు రెండు సేర్ల పాలిచ్చే గేదె ఎక్కడో తప్పించుకపోయిం దనేసరికి, ఒళ్ళు తెలియనంత కోప మొచ్చింది.

పాత బట్టతో కట్టిన ఉయ్యాలలో పడుకున్న పిల్లవేపు చూశాడు. కిరసనాయిల్ బుడ్డీ దీపం వెలుగులో పిల్ల కనుకొలకుల్లో నిలచిన నీరు తళుక్కుమంది బిడ్డ నిద్రలో కూడ ఇంకా వెక్కుతూనే ఉంది. ఇది చూసి అతని మనసు కలుక్కుమంది.

"జుట్టెట్టుకు లాక్కొత్తా" అంటూ బయల్దేరి పోయాడు.

తల్లి వారించి, "ఒద్దు కూకో. రాక ఎటు పోతది. ఎంతసేపు కూకుంటదో అదీ సూద్దాం" అంది.

తల్లీ, కొడుకు కోపంతో మండిపడుతూ తలుపు దగ్గరే కాచుక్కూర్చున్నారు.

సాయంత్రం ఏడింటికి, నీలమ్మ చేతిలో పలక బలపం రసాయనంతో నిండిన దొప్ప పట్టుకొని వచ్చింది. నీలమ్మను చూడగానే శివయ్య కాలరుద్రుడిలా పైకిలేచి, జుట్టు పట్టుకొని లాగి బాదసాగాడు.

మొగుడు ఎందుకలా చేస్తున్నాడో అర్థంకాలా, నీలమ్మకు.

చేతిలోని పలక అంత దూరంలో పడి ముక్కలైపోయింది రసాయనపు దొప్ప క్రిందపడి, రసాయనమంతా మట్టిలో కలసిపోయింది.

"అయ్యో" అని ఏడుస్తూ అతని నుండి విడిపించుకోవటానికి ప్రయత్నించింది నీలమ్మ. కాని అతని భల్లూకపు పట్టునుంచి తప్పించుకొనటం అసాధ్య మయింది.

"ఎక్కడ సచ్చావే ఇంతసేపు ? దీపాలు పెట్టాకనా కొంపకు వస్త ? ఎవడి దగ్గర కులుకుతుంటివో సెప్పు" అరుస్తున్నాడు శివయ్య. కెంచమ్మ దూరంగా నుంచుని, గొణుగుతూంది.

"గేదె ఎటుబోయినాదో తెలీదుగందా. దీని మొహం మండా. దీని అబ్బ ఇంటిసొమ్మా గేదె ? ఇల్లు గుల్ల సేస్తుందా ? పూటకు రెండుసేర్లు పాలు యాడొస్తది ? బుల్లి ఏడ్చి ఏడ్చి నిద్దరోనాది"

ఇరుగు పొరుగు గుడిసెలు వాళ్ళంతా నిలబడి చూస్తున్నారు, ఈ దృశ్యాన్ని.

శివయ్య తన చేతులు నొప్పిపుట్టేదాకా కొట్టి ఆఖరికి దూరంగా తోసేశాడు నీలమ్మను. అక్కడే పడి ఏడుస్తోంది నీలి. ఈ గొడవకు నిద్రపోతున్న బిడ్డ లేచి ఏడవసాగింది. నీలి బిడ్డను దగ్గరకు తీసుకోకుండా మూలుగుతూ పడుకుంది. మొగుడిమీద కోపం బిడ్డమీద చూపిస్తూ.

ఉయ్యాల్లో ఆకలికి ఏడుస్తున్న బిడ్డను తెచ్చి కోడలి కిచ్చింది, కెంచమ్మ. నీలి కోపంతో బిడ్డను దూరంగా తోసింది.

"ఏయ్ బిడ్డను ఎత్తుకుంటావా మళ్ళీ నాలుగు తగిలించనా ?"

మొగుడికి భయపడి నీలి బిడ్డను దగ్గరకు తీసుకొని పాలివ్వసాగింది.

మరుసటిరోజు, బీరమ్మా వాళ్ళంతా కలసి నీలమ్మను పిలవ వచ్చేసరికి, మొహమంతా వాచి పోయింది నీలమ్మకు.

"ఎవరేడ్చారు ఈ సదుగు గావాలని ? నిన్ననగా పోయిన మాయదారి గేదె ఇంకా రానేదు. సదివి పూళ్ళేలుతావా అని బాదేడు"

చెపుతూ చెపుతూ దుఃఖం ముంచుకొచ్చి ఏడవసాగింది నీలమ్మ. బీరమ్మ

"ఏటయిందే నీలీ, మొహమంతా వాచిపోయింది" అని అడిగింది.

"ఈడి సేతు లిరగ, ఎట్టా కొట్టినాడో సూడు. ఎదవ సచ్చినోడు."

"అయితే రావా ?"

"రానమ్మా. ఆరి సదుగుకో దణ్ణం."

బీరమ్మా వాళ్ళంతా అక్కడినుండి రామక్క వాళ్ళింటి దగ్గరికి వెళ్ళారు.

రామక్కకు మారుగా, దాని ముసలి మామ క్రర ఆసరాతో బయటికి వచ్చాడు.

"రామక్క నేదా, ఇంట్లో."

"నిన్న పొద్దుపోయినాక ఇంటికొచ్చిందా మరి? 'ఇంత రేతిరాళ యాడ బోయావ్ ? నాకు కూడెవడు ఒండుతాడు ?' అని కొట్టాడు నంజణ్ణ. ఎంటనే రాత్రికి రాత్రే పుట్టింటికి పోనాది."

"మరి నంజణ్ణ ఏడి ?"

"ఆడూ ఎల్లాడు, బతిమలాడి తీసుకరాటానికి."

నీరసంగా కాళ్ళీడ్చుకుంటూ బయల్దేరారు, బీరమ్మ, మిగతావాళ్ళూను.

ఒక్కరోజుకే ఇద్దరు శిష్యురాండ్రు తగ్గిపోవటం చూసి, మీర

"నీలమ్మా, రామక్క రాలేదేం ?" అనడిగింది. అలసట చెందిన బీరమ్మ, నీరసంగా అంది.

"నిన్న ఇంటికి ఆలిశంగా వచ్చినందుకు, దాని మొగుడు 'నువ్వు సదుగునేర్చి దొరసానమ్మ గావాల్నా?' అట్టాగని చావ బాదాట్ట. రామక్క కోపం సేసుకొని రేత్రికి రేత్రే పుట్టింటికి పోనాదట."

మీర ఉత్సాహం దిగజారిపోయింది.

"నీలమ్మ రాలేదేం ?"

"పెద్ది వాళ్ళ గేదె నిన్న నందేకాడవగా తప్పి పోయాదట. ఈయాల్టికి కూడ దొరకలా. దాని మొగుడు శివయ్య వాళ్ళ హానంచేసి వదిలాడు."

"సరే" అంది మీర నిరుత్సాహంతో.

వచ్చినవాళ్ళకే పాఠం చెప్పటం మొదలెట్టింది. తన విద్యార్థినులకు ప్రోత్సాహ మివ్వడానికోసం, ఆఖరిలో:

"ఒక నెల పూర్తిగా తప్పించుకోకుండా వచ్చిన వాళ్ళకు, ఒక్కో చీర బహుమతి ఇస్తాను" అని చెప్పింది.

కాని చీరమీది లోభం కూడా, ఆమె శిష్యురాళ్ళమీద పని చెయ్యలేదు. సూర్యుడి వేడి తగిలిన మంచుగడ్డలా, మీర శిష్యబృందం కరగిపోసాగింది.

# అపస్వరం

ఒక్కొక్కరు, ఒక్కో కారణం చెప్పి రావటం మానేశారు.

ఎనిమిదిమంది పిల్లల తల్లి, చెన్నమ్మకు ఇంటి పనులతోనే సరిపోయేది. కాళ్ళమ్మ ఇంట్లో ఎనిమిది పది గేదె లున్నాయి. వాటికి మేత అది చూసుకొని పాలు, పెరుగు, వెన్న తీసి పూళ్ళోకి వెళ్ళి అమ్ముక రావటంతో, తీరికన్నమాటే ఉండేది కాదు. చీరమీది ఆశకోసం, బీరమ్మ, కెంపమ్మ, తిమ్మమ్మ మాత్రం వస్తూ ఉండేవారు. అక్షరాభ్యాసం చేసి నెల కావస్తున్నా, నాలుగు అక్షరాలు కూడా సరిగ్గా రాయటం రాలేదు వీరికి. రోజు ఒకే అక్షరాలు రాసి ఇవ్వటానికి మీరకే విసుగనిపించేది కొత్త అక్షరం నేర్చుకుంటే, పాతది మరచిపోయేవారు ఒకరోజు మీర,

"బీరమ్మా, ఇన్నిరోజు లయినా అక్షరాలే రాలేదు మీకు. ఇంకాస్త శ్రద్ధగా నేర్చుకోలేరా?" అనడిగింది.

బీరమ్మ పలక క్రింద పెట్టి "ఎట్టా నేర్చుకుంటాం తల్లీ. సిన్నపిల్లలపుడైతే, ఎంటనే నేర్చుకొనేవోళ్ళం. ఇప్పుడో లన్ని బాధలు. ఏదని సూస్తాం? మొక్కాయి వంగనేదు. ఇప్పుడు ఒంగుతాదా?" అంది.

అక్షరాలు విచిత్రంగా రాస్తున్న తిమ్మమ్మతో,

"ఎన్నిసార్లు చెప్పినా తప్పుగానే దిద్దుతావేం, తిమ్మమ్మా. ఇన్నిరోజులయినా, ఒక్క అక్షరం ముక్క రాలేదే, నీకు" అంది మీర.

"అయ్యోరాత! నా కెందుకు తల్లీ ఈ సదుగు. మాకు తెలిసిన ఇద్దె సాలదా? నేను కావాలిస్తే ఇపుడు నూరు బిందెలు నీళ్ళు తోడి పోయగల్ను. మీరు తోడగల్రా?"

నెల పూర్తికాగానే, మీర మూడు చేనేత చీరలు తెప్పించి, ఆ ముగ్గురికి ఇచ్చింది. మరునటిరోజు నుండి, వాళ్ళూ రావటం మానేశారు!

ఒక్క నెలరోజులకే మీర స్కూలు మూత బడింది!!

తనంతట తాను, చదువు చెప్పటానికి పూనుకున్నా, ముందుకురాని రైతు స్త్రీలమీద, మొదట కోపం వచ్చింది మీరకు. సాయంత్రం అయిదు, అథవా ఆరింటికి వచ్చి, చదువుకోటానికి అడ్డేమిటి? ఈ పల్లెటూరివాళ్ళకు. బొత్తిగా జ్ఞానం లేదు, అనిపించినా, కోపం తగ్గాక, వాళ్ళింటి పరిస్థితులను గురించి, ఆలోచించసాగింది.

తెల్లవారిజామున, తను ఇంకా మంచి నిద్రలో ఉన్నప్పుడే, వాళ్ళు లేచి పనిపాటులు చేసుకోవటం మొదలుపెడతారన్న సంగతి మీరకు తెలిసినదే ఇంటి పనులు చేసుకొని కుర్రాళ్ళతో, ఆవులను, గేదెలను మేతకు పంపి, వంట వండి, పొలాల్లో పని చేస్తున్న మొగవారికి భోజనం తీసుక వెడుతున్న దృశ్యాన్ని తలచుకుంది మీర.



ఇంతకుముందోసారి, ఏదో పండుగరోజున దేవాలయానికి బయలుదేరింది మీర. కొత్తగా తెప్పించుకున్న బిన్నీ జార్జెట్ చీర, ఆమె సన్నటి శరీరాన్ని, అంటిపెట్టుకున్నట్టుంది. మెడలో గొలుసు వేసుకుంది. వెండి పళ్ళెంలో పూజా ద్రవ్యాలు అమర్చుకొని, బయలుదేరింది.

అదే సమయంలో వయస్సుమళ్ళిన బీరమ్మ చిరుగుబట్ట కట్టుకొని, దానితో దేహాన్ని మరుగు పరచుకోవటానికి ప్రయత్నిస్తూ, తలమీద ఓ పాత బుట్టలో తన కొడుకు కోసం పొలానికి భోజనం తీసుకు వెడుతోంది మీరను చూసి ఆగి,

"గుడి కెళ్తుండారా, అమ్మగోరూ" అంది.

"నువ్వెక్కడికి వెడుతున్నావ్?"

"మా కుర్రోడికి, భోజనం తీసుకెడుతున్నా."

"చేతిలో కొడవలి ఉందేం?" మీర బీరమ్మ చేతిలోని కొడవలివేపు చూసింది.

"భోజనంపెట్టి, గేదెకు గడ్డి కోసుకొస్తా."

"ఎన్నింటికి వస్తావ్ మళ్ళీ?"

"పొద్దు చల్లబడేయేళ కొస్తా."

"వెళ్ళు పాపం, అన్నం చారు చల్లారిపోతుం దేమో."

మీర ఒక్కడుగు ముందుకు వేసింది. బీరమ్మ నోటిలో వున్న తమలపాకుల రసం, ఉమ్మివేస్తూ,

"అన్న మెక్కడిది తల్లీ. ఓ సంకటిముద్దా, నంజుకోటాని కింత కారం, అంతే" అంది.

మీర బీరమ్మ బుగ్గవేపు చూసి "ఎప్పుడూ తమలపాకులు నములుతూ ఉంటావు, ఎందుకూ?" అనడిగింది.

ఆకు, వక్క యేసుకుంటే ఆకలి తెల్దం డమ్మ గోరూ. ఆకలేసినపుడల్లా, ఏటి తింటాం ? అందుకే ఆకు, వక్క నముల్తాం."

మీర తన చీర జరీ బార్డరు, నేలకు తగిలి, మురికవుతుందేమోనని, కాస్త పైకి ఎత్తి పట్టు కొని, బీరమ్మ వేపు చూసింది. మీర స్నేహితురాలు రాజేశ్వరి, ఫాషన్ కోసం, వొళ్ళు కనిపించే చోళీ వేసుకుంటే, బీరమ్మ పేదరికం వలన చిరిగిన ముతక రవిక తొడుక్కుంది. మీర తన చీర కుచ్చెళ్ళు నేలకు తగలకుండా ఎత్తి పట్టుకొని ముందుకు నడిచింది. బీరమ్మ తన చిరుగుల కొంగును, మరింత దగ్గరగా లాగి కప్పుకుంటూ పొలంవేపు వెళ్ళింది.

మీర, బీరమ్మ పేదరికాన్ని గమనించింది. చింపిరి గుడ్డలు, ఆకలి తీరని భోజనం, శ్రమ .... ఆ జీవులకు, జీవితంలో ఏమైనా సుఖమంటూ ఉందా ?

బీరమ్మ మొహం విపరీతమయిన పనిపాటుల వల్ల వల్లబడి కళాకాంతులు లేక చెమటతో తడిసి పోతూంటే, మీర మొహం అస్తమానం ఇంట్లోనే కూర్చొని, సూర్యకిరణాలనుండి దూరమైపోస్నో, పవుడర్ల లేపనంతో చెమట పట్టేది.

ఒక్క నిమిషం తీరిక దొరికితే చాలు. విశ్రాంతి తీసుకుందామనుకుంటున్నవారికి తాను చదువు పేరుతో మరింత శ్రమ కలిగించటం న్యాయమా? మీర తనలో తనే తర్కించుకుంది.

ఆమె బడి విషయాలను గురించి వేళాకోళం పట్టించసాగాడు, శాము.

"నేను ముందే చెప్పాను గదండీ టీచర్‌గారూ, ఇక నాకూ, మన రామలక్ష్మణులకూ పాఠం చెప్పండి" అన్నాడు, గిత్తల్ని నిమురుతూ.

"రారా లక్ష్మణా, మేడం దగ్గర పాఠం చెప్పు కుందాం." అన్నాడు లక్ష్మణుని కొమ్ము పట్టు కొని లాగుతూ.

మీర తన కోపాన్ని దిగమింగుకొంటూ, శాము మాటలు తనకు వినిపించనట్టు, పంటితో జొన్న గడ్డిని కొరుకుతూ కూర్చుంది.

"రేపే పాఠం ప్రారంభిస్తారట. మనమంతా సిద్ధంగా ఉండాలి. లేకపోతే, మేడంగారికి కోపం వస్తుంది."

మేతకు వెళ్ళిన కపిల, కాళి, తుంగ, గోపి మొదలగు ఆవులు, తమ దూడలను తలచుకుంటూ, వేగంగా లోపలికొచ్చాయి. మీర కంగారుపడి, చేతిలోని కడ్డీ విసిరివేసి, లేచి నుంచుంది. శాము వాటినంతా కట్టేసి వచ్చి,

"టీచరుకు భయపడే శిష్యు లున్నారు గాని, శిష్యులకు భయపడే టీచరును చూడటం, ఇదే మొదలు ..... " అన్నాడు.

మీర విసుక్కున్న గడ్డిమోపున్నీ శాము మీదికి విసిరి, లోపలికి వెళ్ళిపోయింది. గడ్డిమోపు విరిగి శాము శరీరమంతా, గడ్డితో నిండిపోయింది. నవ్వుతూ గడ్డి దులుపుకున్నాడు.

మీర ఓ పుస్తకం చేతిలో పట్టుకుని కూర్చుంది. శాము గదిలోకి వచ్చినా, తలెత్తి చూడలేదు. పలుకరించలేదు. శాము, ఆమె చేతిలోని పుస్తకం లాక్కొని,

"కోపమా ?" అన్నాడు.

" ........... "

"నామీద కోపం తెచ్చుకోకు, మీరా. నువ్వే పాఠాలు నాకు చెప్పు. కాని, నాకు అక్షరాభ్యాసం అక్కర్లేదు. ప్రేమాభ్యాసం చాలు."

"నేను మీకేం నేర్పను. నాతో మాట్లాడకం డసలు."

"హతోస్మి. ఇదా నా గతి .... ఇదిగో లెంప లేసుకుంటున్నా. ఇకమీదట విన్నప్పుడూ వేళా కోళం చేయను. ఓ చిరునవ్వును అనుగ్రహించు.."

ఇకమీదట తన బడిని గురించి పల్లెత్తుమాట

---

భార్య: (విసుగ్గా) ఏమండీ! మీరు ఎప్పుడు నాది, నాది అంటుంటారే! మనది అనరే!

భర్త: సరే! రేపటి నుంచి అలాగే అంటాలే.

మర్నాడు భర్త: రాధా మనం గడ్డం చేసుకొనే రేజరు ఇలా తీసుకురా!

తేమూరు వెంకటమల్లికార్జున ప్రసాద్ (కావలి)

---

అనననీ, ఒట్టు వేసుకున్నాక కాని, భర్తతో రాజీ పడలేదు, మీర.

మబ్బు పట్టిన ఆకాశంలా ఉంది, మీర జీవితం. రోజులు గడవటమే దుస్తరంగా ఉంది. నూలు వడుకుదామని తెప్పించుకున్న రాట్నం రెండు రోజులలోనే అటకెక్కింది. అస్తమానం ఆలో చిస్తూ కూర్చోవటమే పని అయింది. పల్లెటూరి జీవితానికి, తాను అలవడలేక పోవటమే కాక, తన మనసుకూ, భర్త మనసుకూ అజగజాంతర మున్న దన్న సంగతీ, మీర గమనించింది. ఇద్దరి మన సులూ వ్యతిరేక మార్గాల్లో పయనిస్తున్నాయ్. శాము ఆలోచనలు, అభిరుచులూ, ఆశ, ఆకాం క్షలూ మీర భావాలకు పూర్తిగా, విరుద్ధంగా ఉండేవి. పుడమి తల్లీ, పశుసంపదా, ఇవే అతని జీవిత సర్వస్వాలు. అతని జీవితానికి ఆధార స్తంభా లయిన వస్తువులు, మీరకు అర్థంలేని వనిపించేవి. ఆవు మెడ నిమురుతూనో, దూడలతో ఆడు కుంటూనో, మైమరచేవాడు, శాము. పచ్చటి పొలాల మధ్యన చేతులు కట్టుక నుంచుని ప్రకృతి సౌందర్యాన్నే తిలకిస్తూ, పక్కనున్న మీరను కూడ మరచిపోయేవాడు, రైతుబిడ్డ శాము. మీరకు సమస్యగా పరిణమించినట్టుగానే పట్నం వాసపు పిల్ల మీర, శామునకు పెద్ద సమస్యగా పరిణమించింది.

మీర సంఘజీవి. తనచుట్టూ స్నేహితు లుండా లని కోరుకునేది. శాము ఏకాంతప్రియుడు. జీవం లేని పుస్తకాలతో కాలక్షేపం చేసే మీరను చూసి, ఆశ్చర్యపోయేవా డతను. ఏదైనా చదవటానికి తీసుకుంటే కూర్చున్న చోటనే నిదురవచ్చే దతనికి. చేతిలో పుస్తక ముండగా, నిద్ర ఎలా వస్తుం దబ్బా ! అని ఆశ్చర్యపోయేది మీర.

స్త్రీ భర్తనుండి ఆశించేటంతా తను మీరకు ఇస్తున్నానని భావించాడు, శాము. ఆమె అడిగిన పుస్తకాలు, నగలు, గుడ్డలు, వెంటనే తెప్పించి పెట్టేవాడు. భర్త అభిరుచికి అనుగుణంగా నడుచు కొనటాన్ని అలవరచుకోవటమే, స్త్రీ కర్తవ్యమని, అతని దృఢనమ్మకం. తాను అన్నివిధాల సౌకర్యాలను కలిగించినా ఆమె మనసుకు, శాంతి సమాధానాలు లేవన్న సంగతి అతనికి తెలుసు. కాని, దానికి కారణం తెలుసుకోవాలని ఆత్రుత చెందలే దతను. పట్టణవాసపు పిల్ల. పల్లెజీవితాని కింకా అలవాటు పడలేదు. నెమ్మదిగా అన్నీ సరిపోతాయి లెమ్మను కున్నాడు. ఎప్పుడూ కలలుకనే భావజీవి. మీర నుండి దూరంగా ఉండిపోయాడు శాము.

మీరకు తన ఆశ నెరవేరటం అసంభవం అని పించినా, దాన్ని గురించిన తపన మట్టుకు తప్ప లేదు. ఎడారి ప్రయాణీకునికి నీరు దొరికే ఆశ లేనప్పటికీ, నీటికోసం తపనచెందేలాగానే ఆమె మనసు సంసార బంధనాన్నుండి, ఆశాప్రపంచంలోకి ఎగిరిపోవాలని సూచించేది. యాంత్రికమైన జీవితం వల్ల ఆమెకు పిచ్చిపట్టినట్టయింది. రోజూ ఒకే రకమైన పనులు, రసవిహీనమైన బ్రతుకు, ఆమెకు జీవితంలో నిరుత్సాహం కలిగించసాగాయి. నలుగురు మగపిల్లల మధ్యన మగపిల్లాడిలా స్వేచ్ఛగా పెరిగి, తన చురుకైన బుద్ధివల్ల, ఆటపాటల్లో అభినయంలో ముందంజవేసి అందరి మెప్పుదలా పొందిన మీర జీవితం, ఇప్పుడు మోహానికి గంటలు కట్టించుకొని అటూ ఇటూ చూడకుండా తిన్నగా త్రోవవేపే చూస్తూ, పరిగెత్తే గుర్రంలా సాగి పోతోంది. పల్లెటూరి నీరస వాతావరణం ఆమె లోని ఉల్లాసాన్ని హరించివేసింది.

ఓరోజు కొత్తగా తెప్పించుకున్న నవల చదువు తూ కూర్చుంది. మీర. సాయంత్రం అయిదు గంట అవుతూంది. కిటికీలోనుండి పడుతూన్న సూర్యకిరణాల వెలుగులో చదువుతూ కూర్చుంది. శాము ఇంకా ఇంటికి రాలేదు. కాని, మీరకు అటు వేపు ధ్యాసే లేదు. నవల చదవటంలో లీనమయిన మీరకు టైమెంతయిందో కూడా తెలియలేదు. క్రమంగా చీకటి పడసాగింది. ఇక అక్షరాలు కన్పించనన్నంత వరకు చదివి తల పైకెత్తింది. మీర. పుస్తకం కింద పెట్టి వళ్ళు విరుచు కుంటూ

"ఇంకా రాలేదేం ఈయన" అనుకుంటూ గడి యారంవేపు చూసింది.

"అబ్బ, ఆరున్నర. ఇంకా బోరడు రాలేదేం ?" అనుకుంది. అతడు వచ్చి దీపం వెలిగించివుంటే ఇంకాసేపు చదువుకోవచ్చుగా అనుకుంటూ లేచింది.

బోరడి సోమరితనానికి కోపం వచ్చిందామెకు. కాసేపు బోరడికోసం చూసి, తరువాత తనే లేచి

దేశరక్షణకై ఆయుధాలు ఎంత అవసరమో
ఉత్పత్తి కూడా అంత అవసరమే!




# అధిక కాంతిగా ఉతుకుతుంది!

కొత్తవిధంగా తయారైన సన్‌లైట్‌కు సరికొత్త కాగితపు మూత; సుందరమైన కొత్త ఆకారంగలదు.
అంతేగాక...దాని 'అధిక కాంతిగా చేసే శక్తి' ఉతుకుతుకునకూ మీ బట్టలను అతి కాంతిగా చేస్తుంది....

**అధిక తెల్లగాను, అధిక కాంతిగాను ఉతుకుతుంది**

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S. 56.140 TL3

# అపస్వారం

నేలాడగట్టిన లాంతరుతీసి వెలిగించింది. లాంతరు ఒక్క నిమిషం వెలిగి, ఆరిపోయింది.

"నూనె అయిపోయినట్టుంది. ఛ, ఈ చీకటిలో నూనెలా తేను ?" అనుకుంటూ నూనెకోసం వెతక సాగింది.

"వెంకమ్మగారూ, కిరోసిన్ ఎక్కడుంది ?"

"పశువుల పాకలో గూటిలో ఉంది."

చీకటిలో ఆ పాకలోకి వెళ్ళటానికి భయపడింది, మీర. వెంటనే టార్చ్‌లైట్ గుర్తుకొచ్చింది. టార్చ్ తీసుకుంటూండగానే శాము ఇంటి కొచ్చాడు. ఇల్లంతా చీకటిగా ఉండటం చూసి,

"మీరా, లాంతరు వెలిగించు" అన్నాడు.

"కిరిసిన్ లేద లాంతర్లో. పాకలో ఉందట. తేవాలి ఈ టార్చి కాస్త పట్టుకోండి....."

ఆమె మాటలు ఇంకా పూర్తికాకముందే, శాము నూనె కోసం వెళ్ళిపోయాడు. లాంతరులో నూనె పోసి వెలిగించి,

"మీరా, నువ్వు భోంచేసి పడుకో. నాకోసం కాచుకోకు. ఇప్పుడే వస్తాను" అన్నాడు.

మీర దీపపు వెల్తుర్లో భర్త మొహంవైపు చూసింది. ఎప్పుడూ నవ్వుతూ వుండే అతని కళ్ళల్లోని విషాదాన్ని, మొహంలోని గాంభీర్యాన్ని చూసి, కంగారుగా,

"అలా ఉన్నారేం" అంటూ, నుదుటిమీద చెయ్యి వేసి చూసింది.

"నాకేం లేదు. బాగానే ఉన్నాను బోరడి చిన్న పిల్లాడికి ఉదయంనుండీ మూర్ఛలు వస్తున్నాయి. ఐటికెట్టు లేదు ఈ పల్లెలో వైద్యుడూ లేడు."

"పండితులవారున్నారుగా ?"

"ఆయనా వూళ్ళో లేరు."

మీర చెయ్యి అతని నుదుటిమీది నుండి క్రిందకి జారింది."

డక్టరు లేడు ! పండితులవారూ లేరుట ! కాని తను మాత్రం అక్కడే ఉంది— హృదయంనిండా డాక్టరవాలన్న కోర్కె నింపుకుని, ఎందుకూ ? తనలోని తెలివి, బుద్ధి అన్నీ వ్యర్థం. ఒక బిడ్డ మూర్ఛతో బాధపడుతూంటే, తను చేయగలిగిందేమీ లేదు. తానే డాక్టరి చదివి ఉంటే ? మనిషి కష్టాన్ని పోగొట్టే ప్రయత్నం చేయగల అవకాశం ఉండేది. రోగ రుజినాలతో బాధపడే హృదయాలను, సాంత్వనపరచగలిగేది.

నిస్సహాయతవల్ల మీర కళ్ళల్లో నీరు తిరిగాయ్. తనమీద తనకే పిచ్చి కోపం వచ్చింది. శాము ఆమె మొహం చూసి,

"ఏడుస్తున్నావా మీరా ? ఈ ప్రపంచంలో చనిపోయేవాళ్ళందరికోసం ఏడవగలమా ? వెళ్ళి భోంచేసి పడుకో. నేను రావటం ఆలస్యం అవుతుంది "

మీర దైన్యంతో, "నేనూ మీతో వస్తాను" అంది.

శాము ఆశ్చర్యంతో "ఎక్కడికి ? నే నిప్పుడు బోరడి ఇంటికి వెడుతున్నాను. నువ్వు అక్కడికి వస్తావా ?"

"ఊఁ."

"వద్దు మీరా. నువ్వు భరించలేవు. ఆ బిడ్డ గిలగిలా తన్నుకోవడం చూసి, తట్టుకోలేవు నీవు. అయినా నువ్వెందుకు ఆ భీకర దృశ్యాన్ని చూడటం ?...."

మీర మాట్లాడకుండా చెప్పులు తొడుక్కొని, టార్చ్ చేతికి తీసుకుంది.

"పదండి" అంటూ తలుపు తీసింది.

"మీరా ...."

"వెంకమ్మగారూ .... తలుపు వేసుకోండి" అని గట్టిగా కేకేసి చెప్పి భర్త చేయి పట్టుకుని "పదండి" అంటూ, బయటికి దారితీసింది మీర. శాము ఏమీ తోచనివాడిలా ఆమెతో బయలుదేరాడు.

అమవాస్య రాత్రి కావటంవల్ల, బయట దట్టంగా అంధకారం అలుముకుంది. మబ్బువల్ల నక్షత్రాలు కూడ కనిపించటంలేదు. బయటికి అడుగుపెట్టగానే, చిల్లున చలిగాలి వీచింది. మీర చలికి వణుకుతూ, "అబ్బా !" అంది. ఆమె చేతిలోని టార్చి వెలుగు కొంత దూరానికి మాత్రమే పడుతోంది.

"చలి వేస్తోందా ?"

"ఊఁ."

"నా మాట విని ఇంటికి వెళ్ళు. నేను వెళ్ళి వస్తాను."

" ఉహూఁ."

కాలికి రాయి తగిలి తూల పడబోయింది, మీర.

శాము ఆమె చేతిని పట్టుకుని, "సరే ! పద" అన్నాడు.

ఇద్దరూ మౌనంగా నడక సాగించారు.

దూరంలో కుక్క మొరిగిన శబ్దం వినిపిస్తోంది. చెట్లమీద నుండి వినిపిస్తూన్న గుడ్లగూబ అరుపులు నిశ్శబ్ద నిశీధిలో విస్తృతంగా వినిపిస్తున్నాయ్. సన్నగా వాన జల్లు పడసాగింది.

"ఇంకా ఎంతదూరం ?"

"అదిగో వచ్చేశాం."

బోరడి గుడిసెలో కిరిసిన్ బుడ్డి మందంగా వెలుగుతోంది. గుడిసె చాలా చిన్నది. నలుగురు సమంగా కూర్చొనేందుకు సరిపడే ఆ గుడిసెలో బోరడు, అతని పెళ్ళాం, ఎనమండుగురు పిల్లలు నివసిస్తున్నారు.

శాము బయటినుండే "బోరా" అని పిలిచాడు.

"రండయ్యాగోరూ" లోపలినుండి పిలిచాడు బోరడు.

మీర, శాము లోపలికి వెళ్ళారు. కురచగా ఉన్న ద్వారబంధం మీర నుదుటికి కొట్టుకుంది. మీర అరచేతితో నుదురు రుద్దుకుంది.

"తల వంచుకొని రావాల్సింది" శాము గొణిగాడు.

మీర లోపలికి రాగానే, ఏడుస్తోన్న రాచమ్మ లేచి, చిరుగులచాప తెచ్చి క్రింద పరచింది. మీర చాపమీద కూర్చుంది.

ఆ గుడిసె పైకప్పు కాస్త పొడుగ్గా ఉన్నవారి తలకు తగిలేలా ఉంది. అంతమంది నివసిస్తున్న ఆ గుడిసెకు ఓ కిటికీ కూడా లేకపోవటం చూసి తలుపు మూసేసి వీళ్ళు ఎలా నిద్రపోతారా అని ఆశ్చర్యపోయింది మీర.

బోరడి పెద్ద కొడుకు వయస్సు, పదునాలుగు సంవత్సరాలు. తరువాత రెండేళ్ళకో కాన్పు చొప్పున పిల్లలు కలిగారు. ఒక్క చిన్న గూటిలో నివసించే చీమల్లా జీవిస్తున్నారు వాళ్ళు.

అతని పిల్లల్లో నలుగురు మలేరియాతో బాధపడుతున్నారు. పెద్ద కుర్రాడికి పధ్నాలుగేళ్ళు వచ్చినా, ఎనిమిదేళ్ళ కుర్రాడిలా కనిపిస్తున్నాడు. చర్మపు పొరలో నుండి కనిపిస్తున్న ఎముకలు, చీపురుపుల్లలాంటి చేతులు, కాళ్ళు, తైల సంస్కార మెరుగని గుబురుగా పెరిగిన జుట్టు, బానలాంటి కడుపు, అతడిని రోగిష్టి అని నిరూపిస్తున్నాయి. పిల్లలు నడుముకు చుట్టుకున్న బట్ట తప్పించి, వంటిమీద వేరే గుడ్డన్న మాటే లేదు.

ఇంట్లో నాలుగు మట్టి కుండలు తప్ప, వేరే పాత్రలేమీ లేవు.

(సశేషం)



# చలవ డ్రై వాషింగ్

లక్ష్మీప్రియ

దేహశుభ్రత తరువాత దుస్తుల శుభ్రం చాలా ముఖ్యం. ఈ దుస్తులశుభ్రత కోసం చాకలి వాళ్ళ మీద ఆధారపడినన్నినాళ్ళు మనకు తిప్పలు తప్పవు ఎవరికి వాళ్ళు బట్టలు యింట్లో వుతుక్కోగలిగితే చాకలిఖర్చు తప్పడమేకాక, బట్టలు పోవడం, చినగడం సంభవించవు.

పిల్లలు సహజంగా బట్టల్ని ఎక్కువ మురికి చేసుకుంటారు. ఆటలూ పాటలూ వగైరాల్లోపడి ప్రొద్దున్న వేసుకున్న బట్టలు సాయంకాలానికి తోళ్ళలా చేసుకుంటారు. అందుచేత వాటిని వుతికేముందు కాస్త శ్రద్ధ చూపాలి.

అసలు బట్టల్ని వుతికేముందు చినుగులుగాని, మరకలు గాని వుంటే వాటి విషయంలో ముందు శ్రద్ధ తీసుకోవాలి. చినుగులు కుట్టేసి మరకలు పోగొట్టాలి. మరకల్లో పండ్లమరకలు, సిరామరకలు, పెట్రోమరకలు యిట్లా రకరకాలుంటాయి. మరక అవగానే ఏమాత్రం ఆలస్యమూ లేకుండా పోగొట్టే ప్రయత్నం చేయాలి. అయి అవగానే పోగొడితే మరక త్వరగా వదలిపోతుంది. లేనట్లయితే బట్ట చినగాలే గాని మరకపోదు.

సిరామరక అయిన పక్షంలో ఓప్లేటులో నిమ్మ రసం పిండి, అందులో కాస్త వుప్పువేసి, పాతబ్రెష్ గాని, దూదిగాని ఆ రసంలో ముంచి మరక పడ్డ చోట గుండ్రంగా తిప్పాలి. ఇట్లా చేస్తే సిరామరక తేలిగ్గా పోతుంది. పండ్లమరకలూ, కాఫీ, బురదా యిది వెంటనే గోరువెచ్చని నీళ్ళతో కడిగి, ఆపైన చన్నీళ్ళతో కడిగితే పోతాయి. పెట్రోడాగులూ, తుప్పుడాగులూ పడ్డాయా అంటే, బట్టచినగాలే గాని, దేనితోనూపోవు. పోతే, రంగులు అంటే పెయింట్లు బట్టమీద పడితే కాస్త టర్పెంటయిన్ గాని స్పిరిట్‌గాని ఓప్లేటులో పోసి దూదితో వొత్తి తుడిస్తే రంగు మరక పోతుంది. మరక పూర్తిగాపోక కాస్త డాగు లీలగా మిగలడం కద్దు. పైన కాస్త టాలకమ్ పౌడరు వేసి, కొంచెం అట్టే పెడితే మరక పూర్తిగా పోతుంది. ఈ మరకల్ని వుహాయంగా వెంటనే వదిలించేస్తూవుండాలి. అప్పుడు అశ్రద్ధచేస్తే కొన్ని మరకలు మరి జన్మలో వదలవు.

చినుగులు కుట్టేసి, మరకలు పోగొట్టి పిల్లల బట్టలూ, అండర్‌వేర్సూ, బెడ్‌షీట్సూ, పిల్లోకవర్సూ మొదలైన మురికి బట్టలు వోపక్కగా తీసివుంచుకోవాలి. వీటిని నెలకొకసారైనా వుడకవెయ్యాలి. ఓడేగిసా తీసుకొని పొయ్యిమీదపెట్టి సగానికి నీళ్ళుపోసి, బాగావేగనిచ్చి, ఆ నీటిలో రెండు టేబుల్ స్పూన్స్ చాకలి సోడా, అర టీస్పూన్ బోరాక్సు పొడి వేయాలి. ఈ బోరాక్సును తెలుగులో వెలిగారం అంటారు. యిది బట్టలను శుభ్రపరుస్తుంది. తరువాత మనం వేయదలచిన బట్టల్ని ఆ నీళ్ళల్లో వేసి అరగంట వుడకనివ్వాలి. మధ్యమధ్య బట్టలను కిందనుంచి పైకి, పైనుంచి క్రిందకు తిప్పుతూ వుండి అరగంట అయ్యాక కాగునుదించి మూత పెట్టి పావుగంట అట్టేపెట్టాలి. ఆపైన చేత్తో బాగా వుప్పళిస్తే మురికి శుభ్రంగా పోతుంది.

చొక్కాలు, అండర్‌వేర్సూ నేలమీదవేసి ఉతికినా ఫరవాలేదు. అదే మంచి చీరలూ, సున్నితమైన బట్టలూ అంటే పిగిలి చినిగిపోతాయి. అంచేత బట్టల్ని సాధ్యమైనంతవరకూ చేతితో బాగా ఉప్పళించి, ఆపైన మంచి నీటిలో జాడిస్తే మురికి శుభ్రంగా పోతుంది. రంగులుపోయే బట్టలయితే సోపు నీటిలో వేసీ వేయగానే ఉతికెయ్యాలి. సిల్కులు, షిఫాన్, జార్జెట్ వగైరా నాజూకు బట్టల్ని జాడించాక, చేత్తో పిండకూడదు. వంపు మీదనో, కుర్చీమీదనోవేసి— నీటిని దానంతట అదే వోడిపోనివ్వాలి.

ఒక విషయం. ముదురురంగు నూలు చీరలు గాని, పట్టుచీరలు గాని ముదురురంగువి అయి నప్పుడు మొట్టమొదటిసారి, అంటే కొత్తవి ఉతికేటప్పుడు ఒక విషయం గమనించాలి— ఓ చారెడు ఉప్పు తీసుకొని అర బక్కెటు చన్నీటిలో ఆ ఉప్పును కరగనిచ్చి అందులో ఈ కొత్త రంగు చీరను ఓ పావుగంట నాననిచ్చి ఆపైన సబ్బుపొడిలో గనక తడిపితిగా ఇక ఆ చీర చినగాలే గాని రంగుపోదు.

వెంకటగిరి జరీ చీరలు, తెల్ల జార్జెట్, షిఫాన్, ఆర్గండీ ప్రింట్ చీరలు వీటికి గంజితోపాటు నన్న తళుకు కూడవేస్తే యిస్త్రీ చేశాక చీరెలు ధగ ధగ మెరుస్తూ ఉంటాయి. కుంకంలో వేసు కొనే తళుకుగాని, మైకాపొడిగాని, ఓ చిటికెడు గంజిలో కలిపి, అందులో చీర ముంచి, గంజి బాగా చీరకు అంటాక, పిండి ఆరెయ్యాలి ఈ మాదిరి చీరలు పగలయితే సూర్యకాంతిలో, రాత్రయితే లైట్ల వెలుగులో జలతారు చీరలమాదిరి తళుక్కున మెరుస్తూ ఉంటాయి. ఈ తళుకు పల్చగా వేయడం మూలాన ఇది చీర తళుకో, లేక పూలు కుట్టారో తెలీక చూడ్డానికి చాల గమ్మత్తుగా అందంగా బావుంటుంది.

ఇక ఆరేయడం— చీరలన్నీ కుచ్చెళ్ళు క్రిందకు వచ్చేటట్లు ఆరెయ్యాలి. తెల్లబట్టలు ఫెళ్ళున కాచే ఎండలో వెయ్యాలి బట్టలు ఆరేసేముందు దణ్ణంగాని, తాడుగాని, తీగగాని శుభ్రంగా ఉన్నదీ లేనిదీ చూసుకు, ముందు తడి, పొడి బట్టలతో తుడిచి ఆపైన ఆరెయ్యాలి. ఏమాత్రం అశుభ్రంగాఉన్నా దండెం మరకలు బట్టలకు పట్టుకొని మన శ్రమఅంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. బట్టలు గాలికి క్రిందపడి మన్నులో పొర్లాడి పోకుండా ప్రతి బట్టకీ ఉడెన్‌క్లిప్పు పెట్టుకుంటే మాటి మాటికి లేచి క్రిందపడిన వాటిని ఆరేయవాల్సిన బాధ తప్పుతుంది.

చివరగా ఒక మాట— తెల్ల బట్టలకు నీలం గాని, నీలంలాంటి మందులుగాని వేస్తున్నపుడు ఆ నీటిలో కాస్త వెనిగర్ గనక కలిపితే బట్టలు మరికాస్త కాంతివంతంగా కనిపిస్తాయి. రంగు చీరలు బాగా ఉండాలీఅంటే— చీరలు గంజిలో ముంచేటప్పుడు, ఆ గంజి నీటిలో చిటికెడు అమ్మోనియా వేస్తేసరి—చీరలు ఆరాక చక్కగా మెరుస్తూ ఉంటాయి. కాస్త వోపిక ఉండాలేగాని, ఉతికినప్పుడు బట్టలు కొత్తవాటిల్లా చేసుకోవచ్చు. ★




"నెలకి తలా అయిదురూపాయలు అందరం యిచ్చుకొంటాం. కొత్త చీరలు గురించి, తగ్గింపు ధరల బోర్డులు బయటపెట్టకండి బాబూ."

# వంటలు

## రసగుల్లా

శేరుపాలు. మంచివి కావాలి. అయితే పావు ఛెన్నా అవుతుంది. కల్తీవయితే పావు ఛెన్నా అవదు. ఛెన్నా కూడా బాగుండదు.

ఛెన్నా పావుశేరు అయితే
పంచదార పావున్నర
ఒక చెమ్చా గోధుమనూక

ఛెన్నా చేయువిధము :

శేరుపాలని వెడల్పాటి గిన్నెలో పోసి కిందా మీదా మరిగించాలి. మీగడ కట్టకుండా కలుపుతుండాలి. రెండు మూడుపొర్లు పొంగాక దించెయ్యాలి. వాటిని చల్లార నివ్వాలి. అంటే మనం వేలు పెట్టగలిగే వేడి ఉండాలి. ఆ పాలల్లో ఛెన్నా నీళ్లు చుట్టు తిప్పుతూ పొయ్యాలి. ఛెన్నా నీళ్లు హొటల్‌లో అడుగుతే ఇస్తారు. దొరుకుతే మంచిదే. లేకపోతే ఒక దినం ముందుగా కొద్ది పాలని నిమ్మరసం వేసి విరవాలి. ఆ నీటిని మరుసటి దినానికి ఉంచుకోవాలి. పాలల్లో ఛెన్నా నీళ్లు పొయ్యగానే పాలన్నీ విరిగిపోవాలి. పూర్తిగా చల్లారాక ఒక గుడ్డలో వడకట్టాలి. ఆ నీటిని మరుసటి దినానికి ఉంచవచ్చు. లేకపోతే పారవేయవచ్చు. ఛెన్నాలో నీళ్ళన్నీ వచ్చేసేవరకు గుడ్డలోనే ఉంచాలి. తరువాత ఒక పళ్లెంలోకి తీసుకుని, చెమ్చా గోధుమనూక, చెమ్చా పంచదార బాగా కలపాలి. ఎవరికి ఎంత సైజు కావలిస్తే అంతేసి ఉండలు చుట్టుకోవచ్చు. యాలకులు, జీడిపప్పు, కిస్‌మిస్ వేసుకోవాలనుకున్నవారు ఆ ఉండలమధ్య పెట్టుకోవచ్చు.

దీనికి కుంపటి మాత్రం పనికిరాదు. పెద్దగా మండే పొయ్యి అయితేనే బాగా పొంగుతాయి. మూకుడు కూడా వెడల్పాటిదే కావాలి. మూకుడులో పావున్నర పంచదార, రెండున్నర పావులు లేక అంతకు కొద్దిగా ఎక్కువగానైనా నీళ్లు పోసుకుని పొయ్యి మీద పెట్టాలి. మంటలు మాత్రం పెద్దగా మండుతూండాలి. కొద్దిగా పాకం వచ్చాక ఈ ఉండలన్నీ అందులో వెయ్యాలి. అవి క్రిందా మీదా ముప్పావుగంట ఉడకాలి. బాగా ఉడికాక పెద్దవిగా పొంగుతాయి. అవి ఉడకకుండా పంచదార పాకం వచ్చేస్తే మరికొద్దిగా నీళ్లుపోసి దించెయ్యాలి. నీళ్లు పొయ్యకపోతే పాకం చిక్కగా ఉండిపోతుంది. రసగుల్లాలకి పాకం నీళ్ళగా ఉండాలి కనుక పాకం పూర్తిగా ఉడికిపోయాక ఒక అరగ్లాసుడు నీళ్లు పోసి మరీ దించాలి.

ఉడికేది లేనిది తెలియటానికి ఒక రసగుల్లాని తీసి చల్లని నీళ్లలో వెయ్యాలి. వెయ్యగానే గుండ్రంగా ఉండక మెత్తబడినట్లయితే ఉడక లేదన్నమాట. పూర్తిగా ఉడికిపోయిందయితే నీళ్లలో వేసినా గుండ్రంగానే ఉంటుంది.

**రసగుల్లాని వేరే గిన్నెలోకి తీసి అట్టే పెట్టు**కోవాలి. అవి చల్లగా అయ్యాక తింటేనే తియ్యగా ఉంటాయి. వేడివి తింటేమాత్రం ఒళ్లు మండేటట్లు ఉంటుంది సుమండీ. వేడివితింటే నోరంతా పొక్కిపోతుంది. ఇది మాత్రం ముఖ్యంగా జ్ఞాపక ముంచుకోండి. తరువాత నన్ను తిడితే లాభంలేదు. ఇక పొయ్యి, మూకుడు ఈ రెండూ నే చెప్పిన విధంగా ఉండాలి. లేకపోతే రసగుల్లాలు బాగారావు.

## ఆరెంజి మర్మలేడు

కావలసిన సామగ్రి :

పచ్చి నారింజకాయలు
పంచదార

ఒక చిన్న కాగులో నీళ్లు మరగించి నీళ్లు కాగిన తర్వాత ఒక వెడల్పాటి బేసిన్‌లో నారింజకాయలువేసి వాటిమీద కాగులోని నీళ్లుపోయాలి. అయిదు నిమిషాలు ఆగి, కాయలన్నీ గుడ్డతో తుడవాలి. ఇలా చేయడంవల్ల కాయలలోఉన్న చమురంతాపోయి కాయలకున్న పసరురంగు కొంత తగ్గుతుంది. తరువాత ఆ కాయలన్నింటిని కత్తితో సగానికికోసి, వాటిని స్టీలు గిన్నెలోకైనా, ఎనామిల్ గిన్నెలోకైనా గింజలు లేకుండా రసం పిండుకోవాలి. రసం గిన్నెలో పోశాక గిన్నెను తూకం వేసి రసం తూకమునకు సరిపడిన పంచదారను కూడా వేసి గిన్నెను ఒక ప్రక్కగా ఉంచాలి. తరువాత మిగిలిన పెచ్చులతోవున్న తొనలన్నీ తీసి పారేసి (సగం పెచ్చులు చాలు) ఈ చెక్కలన్నీ సన్నగా ముక్కలుగా కోసి ఒక గిన్నెలో వేసి, అవి మునిగేవరకు నీరు పోసి కుంపటిమీద ఉంచి మూత పెట్టినట్లయితే కొంతసేపటికి ముక్కలు మెత్తగా వుడుకుతాయి. వాటిని కొంచెం చల్లారిన తర్వాత కొద్ది కొద్దిగా ఒక గుడ్డలోవేసి గట్టిగా పిండితే చిక్కని ద్రవ పదార్థం గోధుమరంగులో దిగుతుంది. అది చాలా చేదుగా ఉంటుంది. ఈ చేదురసాన్ని నారింజ రసంఉన్న గిన్నెలోపోసి బాగా కలిపి గిన్నెను కుంపటిమీద ఉంచి బాగా విసరాలి. ఆ రసాన్ని బాగా కలుపుతూ ఉండాలి. కొంచెం సేపటికి పాకం రావడం ప్రారంభిస్తుంది. పాకం సరైనదిగా వచ్చినట్లయితే తెలియడానికి కాగుతూవున్న రసాన్ని కొంచెం నీళ్ళలోవేస్తే పాకం వచ్చినట్లు వేడి చల్లారి గట్టిపడుతుంది. ఇలా సరైన పాకం రాగానే దింపి వెంటనే ఇంకొక స్టీల్ గిన్నెలో పోసెయ్యాలి. లేకపోయినట్లయితే గిన్నె వేడికి పాకం మరీ ముదురుపాకం అయిపోతుంది. ఈపాకం పూర్తిగా చల్లారనిచ్చి నోరు వెడల్పుగల సీసాల్లో పోసి ఉంచుకుంటే ఎన్ని రోజులైనా చెడిపోకుండా ఉంటుంది. బ్రెడ్‌తోగాని మామూలు రొట్టెలతోగాని కలిపితింటే ఎంతో రుచిగా ఉంటుంది.

ఈవిధంగా నిమ్మకాయతో కూడా చేసుకోవచ్చు.

**టి. భామాదేవి ★**

ఉచితము! ఉచితము!!

# తెల్లమచ్చలు

మా ప్రఖ్యాతివహించిన 'డాగ్‌పాఫా' ప్రత్యేక ఔషధము తెల్లమచ్చలను సులభముగ పోగొట్టుటలో 1925 సం॥ నుండి ప్రఖ్యాతి వహించియున్నది. మూడురోజులు వాడినంతనే మచ్చల తెలుపుదనం ఆగిన కొన్ని రోజుల్లోనే పూర్తిగా బాగుచేయు శక్తి గలదు. ఉచితంగ ఒక పాకెట్ మందు ఇవ్వబడును. నకలును చూచి మోసపోకండి.

**Ashoka Treatment Centre,**
**P. O. Katri Sarai (Gaya)**



ఉచితము

ఆశ్చర్యకరమైన తక్కువ ధరలకు మిక్కిలి అందమైన చేనేత చీరలు. ఒక చీర రు. 8/50 (అసలు ధర రు. 12/-). 2 చీరలు రు. 16/-. 3 చీరలు రు. 24/-. పోస్టేజి ఉచితం. డీలక్సు రకం ఒక చీర రు. 12/50. 2 చీరలు రు. 24/-. 3 చీరలు రు. 35/- పోస్టేజి ఉచితం. స్పెషల్ రకం ఒక చీర రు. 16/-. 2 చీరలు రు. 30/- 3 చీరలు రు. 42/-. పోస్టేజి ఉచితం. ఏదైన 3 చీరలు కొనిన యుయుర్‌టాప్స్ ఉచితం. అందమైన షర్టుగుడ్డ పీసు రు. 7/50. 2 పీసులు రు. 14/-. 3 పీసులు రు. 20/-. పోస్టేజి ఉచితం. కొద్ది స్టాకు గలదు. ఆర్డరు వెంటనే పంపండి. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయవలెను.

**THE ROYAL STORES (APTW),**
**Post Box No. 1774, Delhi—6.**

## డాక్టర్ వృత్తి చేయండి!



విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ ద్వారా హోమియోపతిలో మూడు గొప్ప డిగ్రీలు M.D.H. M.Sc.,(Homoeo) Gold Medalist. గవర్నమెంటు రిజిస్టరు కాలేజిద్వారా పొందండి, పేరు,డబ్బు సంపాదించండి. ఉచిత ప్రాస్పెక్టస్‌కు వ్రాయండి.

INDAIN HOMOEOPATHIC COLLEGE
(WPM) P. B. 89. Jullundur City.

వేసవిలో దాహానికి ఆరోగ్యకరమైన
చల్లని పానీయం!
AN ACE PRODUCT

# డ్రింకోలన్

వాడండి!



పలు రకముల
పళ్ళ రసములతో
తయారుచేయబడినది.



వివిధ రకముల పళ్ళ రసములతో తయారైన అన్ని రకముల పానీయములు కూడా లభించును.

తయారుచేయువారు.

## ఎంబ్రోసియా

క్యానింగ్ ఎంటర్‌ప్రైసెస్.
పోష్టుబాక్సునెం.43. విజయవాడ-3

## చార్మిస్ మీ ముఖవర్చస్సును మనోహరముగా చేస్తుంది!



ఉత్సాహవంతులుకండి...
లాలిత్యం పొందండి...
రోజంతా
శోభచేకూర్చుకోండి!

చల్లని, పెదదేర్చ చార్మిస్ మిమ్ము రోజంతా శోభచేకూర్చుటలో తోడ్పడుతుంది. చార్మిస్‌యొక్క ఆనందప్రదమైన వాసన మిమ్మల్ని పెదదేర్చుటలో ఇంద్రజాలములా పనిచేస్తుంది—మిమ్మల్ని ఉత్సాహవంతులను చేస్తుంది...మిమ్మల్ని అందముగా మనోహరముగా కనపడేలా చేయుటలో సహకరిస్తుంది.

# చార్మిస్

టాల్కమ్ పౌడర్ ఆనందప్రదమైన వాసన కలిగి వున్నది

CHTP.G.11.TEL

# సరాగమాల

**వి.ఎ.కె. రంగారావు**

హిందీ పాటలు పరిచయం చేయరేమి రంగారావుగారూ అని అడుగుతూ వచ్చే ఉత్తరాలు ఈమధ్య మరీ ఇనుమడిస్తున్నాయి. నిజం చెప్పాలంటే హిందీ చిత్ర సంగీత రంగాన్ని రెండు మూడేళ్ల క్రింద టంత శ్రద్ధగా ఇప్పుడు పరిశీలించటంలేదు. దీనికి కారణాలు ఎన్నో ఉన్నవి. కాని కాకతాళీయంగా కర్ణమధురమనిపించిన పాటలు కొన్నిటిని క్రింద పరిచయం చేస్తున్నాను.

### వీర్ భీమసేన్ నె 54709

ఇరవై అయిదు సంవత్సరాలనుండి సినిమా పాటలలో సాహిత్యాన్ని సృష్టిస్తున్నది ప్రదీప్ అనే మహాకవి. వీరి రచనలు బాంబే టాకీస్‌వారి చిత్రాలలో, ముఖ్యంగా ఝూలా, కంగన్, బంధన్ చిత్రాలలో పేరెన్నిక గన్నవి. అప్పట్లో వారు కొన్ని పాటలను కూడా పాడేవారు. అన్ని రకాల పాటలు వ్రాయటంలోనూ వీరు సిద్ధహస్తులే అయినా తత్వాలు, భక్తి గీతాలు వీరిచేత ఎక్కువగా వ్రాయించుతారు. 'నాస్తిక్' చిత్రంలో వీరు వ్రాసి, సి. రామచంద్ర సంగీతాన్నియ్యగా వీరే పాడిన ''దేఖో తేరే సంసార్ కీ హాలత్ క్యాహోగయీ భగవాన్ కితనా బదల్ గయా ఇన్‌సాన్'' అఖండమైన ప్రజాదరణ పొందినది.

సి. రామచంద్ర, ప్రదీప్, సంగీత సాహిత్యాలకు అత్యుత్తమ రూపాన్నివగల సమర్థులు. వీరి మొదటి కలయిక 'నాస్తిక్'తోనే అనుకుంటాను. ఏరలా జాయ్ ఫిలింస్‌వారి పౌరాణిక చిత్రం ''వీర్ భీమసేన్'' లో కలిశారు. ఈ దేవ గాంధర్వుల కూడికను సిద్ధించిన పాటలు ఎంత మధురాలో విని తెలుసుకోవాలి. సి. రామచంద్ర గురించి మరొక మాట. జయంత్ దేశాయ్ నిర్మించిన ''భక్తరాజ్'' అనే పౌరాణిక చిత్రానికి సంగీతకారులు వారే. అది విడుదలయి సుమారు ఇరవై ఏళ్లు కావస్తోంది. అప్పట్లోనే ఆ చిత్రం రజతోత్సవాలు, కౌసల్య పాడిన ''కహాఁ హై తేరి నగరియా'', వాసంతి పాడిన ''మై తేరాహు మత్‌వాలా, కహాన తేరా'' పాటల తోడ్పాటుతో చేసుకొన్నది. ఇప్పట్లో ఈ ''వీర భీమసేన్'' కూడా సంగీత బలంతోనే విజయవంతమైనట్లు తోస్తున్నది. అది బొంబాయి చిత్రవర్గాలనుంచి అందిన వార్త. ఇక పాటల గురించి.

ఆశా భోసలే మహేంద్ర కపూర్ పాడిన ప్రణయగీతం ''ముఝేక్యా మాలూం''లోను, సాహిత్య రచనా ప్రణయం సంగీత రూపాన మూర్తీభవించినట్లు మెత్తగా మెల్లగా చల్లగా ఉన్నవి. వాద్య గోష్టిలో వేణువులు వాయులీనాలు ఒక దానిలో ఒకటి కలసి, పెన వేసుకొని ఆహ్లాదానికి ఆధారమయిన సప్త స్వరాలివేనని నిరూపిస్తున్నవి. గాయకుల కంఠంలో కొంత ప్రేమ, ఒకింత మోహం, మరికొంత కామం, కొంత తీక్ష్ణత, ఇంకొంత మార్దవం రంగరించబడి విన్నవారి మనసులో ఏవేవో చిలిపి తలపులను మొలకెత్తిస్తున్నాయి. ఒకసారి వినరూ.

రెండవ ప్రక్క ద్రౌపదీ విలాపగీతం. ఇందులో సంగీతాన్ని, స్వరాన్ని అధిగమించినది ప్రదీప్ వ్రాసిన సాహిత్యం. ''స్త్రీని అవమానించిన సమాజం నశించక మానదు. చేసిన పాపం ప్రతి మానవుణ్ణి తుద ముట్టించక పోదు'' ''అరే పాడియా'' ఇంతటి సాహిత్యం వెనువెంట ఎంత ఉదాత్తంగా, ధీరంగా విషాద రాగాన్ని సి. రామచంద్రుడు పలికించాడో తెలుసుకోవాలంటే పాటను వినాలి.

ఒక్క విషయం. ద్రౌపది మాన సంరక్షణ చేసినది మాధవుడుకదా. ఈ పాటలో అతనిగూర్చి లేకపోవటం గమనించదగ్గదే. సినిమా చూస్తేనే గాని ఈ చిక్కు విడదనుకుంటాను.

### వీరభీమసేన్ నె 54708

కలిగీ కలగని తొలి ప్రేమను ఎప్పుడైనా చవి చూచారా! పండీ పండని దొర పెదవుల సుధామృతాన్ని ఎప్పుడైనా తనివితీర గ్రోలినారా! సిగ్గుతో మొగ్గలైన ప్రేమకలాపాలను ఎప్పుడైనా విందారగించారా! అయితే మీ రీ పాటను, ఆశా పాడిన ''దేఖో జీ దేఖో ఆక్‌లదగయా'' పాటను విన నక్కరలేదు. అవన్నీ మళ్లీ గుర్తుకు తెచ్చుకోవాలనే ఉద్దేశం లేకపోతే. పల్లవి తరువాత ఆశా ''ఉయ్'' అనటం వినండి. లాలసాసక్తితో మీ ఒడలు పులకరించకపోతే నాకు వ్రాయండి. రసికత లేనందుకు నా సానుభూతి వెల్లడించుకుంటాను.

రెండవ ప్రక్క లతా మంగేష్కర్. ఈ పాట ఆనందించటానికి ఆ భాష తెలియ నక్కరలేదు. అంతవరకూ కాదంటూ అప్పటికి చిరుకదలింపుతో సిగ్గుతో సరే అని సూచించే ప్రియాభావనను ఆ తలపంకింపును అర్థం చేసుకో గలిగితే చాలు. సంగీతం తెలియానక్కరలేదు. రాగరంజితమైన రెండు హృదయాలు పరవశాన పాడుకునే గీతం తెలిస్తే చాలు. ఆ కిన్నెర కంఠాన్ని ఆస్వాదించగల ప్రత్యేక శక్తి అవసరంలేదు. కోరికతో దగ్గరకు రమ్మని పిలిచినపుడు విని అర్థం చేసుకొంటే చాలు. ఈ పాట, ఇంత అందమైన పాట ఆనందించటానికి ఇవి మాత్రం కావాలి.

ఈ నాలుగు పాటలలో సి. రామచంద్ర సంగీతాన్ని గురించి నాలుగు మాటలు. ఈనాడు ప్రజాదరణ పొందుతున్న హిందీ పాటలు మాత్రమే నచ్చేవారికి ఈ లలిత గీతాలు నచ్చడం కష్టమే. పై పాటలలో వెనకాల తల దిమ్మెక్కించే వాద్యాల రొద లేదు. పాట మధ్య మధ్య చెవులు బద్దలయే కేకలు (యేం చేయను మరి: గుడివాడ భాషా సాంగత్యం!) లేవు. వేయేల లలితేతరమయినది ఒక్కటీలేదు. కాబట్టి పై పాటలు లలిత సంగీత ప్రియులకే, రసికులకే, సంగీతంలో, సాహిత్యంలో రసాస్వాదన చేయ గలిగిన వారికే. ★



''మంగమ్మ శపథం'' కొడైకెనాల్ అవుట్‌డోర్‌లో నిర్మాత శ్రీ డి. వి. యస్. రాజు, జమున, ఆమె తల్లి

# చిత్రలహరి

## వీరప్రతాప్

శ్రీ డి. బి. నారాయణ నిర్మాతగా విశేషమయిన అనుభవం సంపాయించిన వ్యక్తి. ఆయన ఏవని చేసినా నిర్మాణాత్మకంగా, చక్కగా ఉంటుంది. శివశక్తి మూవీస్‌వారి జానపద చిత్రానికి ఆయన ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్‌గా వ్యవహరిస్తూ నిర్మాణ కార్యకలాపాలు దగ్గరుండి చూస్తున్నారు. ఈ చిత్రం జానపద మయినా, ఆయన నిర్మించే చిత్రాల స్థాయికి ఏమాత్రం తగ్గదని— ఇందులో ఉపయోగించుతున్న విలువైన కాస్ట్యూమ్స్, సెట్స్ నిరూపించుతున్నవి. దేవకి అనే కొత్త అమ్మాయిని ఈ చిత్రంలో వాంప్ భూమికలో పరిచయం చేస్తున్నారు శ్రీ డి. బి. ఎన్.

కుమారి దేవకి ప్రాయంలో ఉన్న చిన్నది. చక్కని నర్తకి. ఆటలో తన సాటి ఎవరూ రారనేంత మేటి. అలాంటి నేర్పు ఈ అమ్మాయిలో అగుపిస్తున్నది. అందమూ, వాక్చాతుర్యమూ కూడ ఉన్నవి. జనవరినెల చివరి భాగంలో దేవకిపై ఒక పాట—

"చిక్కిన చిలకను కానోయ్

చిన్నపిల్లనోయ్ మామ ...."

శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాసినది, కోదండపాణి సంగీత దర్శకత్వంలో జానకి పాడినది— చిత్రీకరించారు. ధూర్జటి విలాస మందిరంలో, అతడిని ఉత్సాహపరుస్తూ, మరులుగొల్పుతూ మేనక ఆడుతూ పాడే పాట యిది. నృత్యాన్ని కూర్చినది కె. ఎస్. రెడ్డి. నృత్య దర్శకుల పేర్లలో ఈమధ్య రెడ్డిగారి పేరు కూడ ఎక్కువగా వినవస్తున్నది. ఆయన కంపోజ్ చేసే నృత్యాలలో కొత్తదనం స్ఫుటంగా కనిపిస్తున్నది. కుమారి దేవకి లేడిపిల్లలా చెంగుచెంగున గెంతుతూ చక్కగా అభినయం చేసినది. ఈ చిత్రం ద్వారా ఆమెకు ఉజ్వల భవిష్యత్తు ఉన్నదని తోస్తున్నది.

యువ దర్శకుడు శ్రీ ఎస్. ఆర్. శర్మ దర్శకత్వంలో ఈ చిత్రనిర్మాణం వీనస్ స్టూడియోలో చకచక సాగిపోతున్నది. కథ, సంభాషణలు ఆదుర్తి వెంకట నరసింహమూర్తి రూపొందించారు. కొత్త సంవత్సరంలో కొత్త కవినీ, దర్శకుడినీ, సరికొత్త నర్తకినీ "వీరప్రతాప్" చిత్రం ద్వారా ఆంధ్రులకు పరిచయం చేస్తున్నారు శ్రీ డి. బి. యన్.

## శకుంతలగా సరోజాదేవి

రాజ్యం ప్రొడక్షన్స్‌వారు భారీ ఎత్తున నిర్మించ తలపెట్టిన "శకుంతల" చిత్రంలో బి. సరోజాదేవి శకుంతల భూమిక పోషించగలదని తెలియవచ్చింది. మొదట సావిత్రి ఈ పాత్రను పోషించుతుందని అనుకున్నారు. కారణాంతరాలవలన ఇప్పుడు ఆమె స్థానే సరోజాదేవిని నియోగించుకున్నారు. శకుంతలగా మీరు బావుంటారనీ, ఆ వేషం మీర్వేయగా చూడాలని ఉందనీ— ఆమె అభిమాన ప్రేక్షకులనుంచి శరపరంపరగా లేఖలు వచ్చినవట! ఒక యువ దర్శకునితో సరోజాదేవి ముచ్చటిస్తూ, ఈ విషయం వెల్లడించినదట! నిజానికి శకుంతలగా సరిపడే యువతి పరిశ్రమలో ఉన్నది ఆమె ఒకరే!

దుష్యంతుని భూమికలో ఎన్. టి. రామారావు కనిపించుతారు. శారద, గీతాంజలి, అనసూయ, ప్రియంవదలుగా నటించుతారు. మేనక, విశ్వామిత్రులు ఇ.వి. సరోజ, ముక్కామల. మిగిలిన పాత్రధారులను కూడ త్వరలోనే ఎన్నిక చేసి సెట్స్‌పైకి వెళతారు. రచన : సముద్రాల (సీనియర్), గీతాలు: సముద్రాల, కొసరాజు, శ్రీ శ్రీ, కళ : టి. వి. యస్. శర్మ, సంగీతం : ఘంటసాల, నృత్యాలు : వెంపటి సత్యం, కూర్పు : ఎస్. పి. ఎస్. వీరప్ప, దర్శకత్వం : కె. కామేశ్వరరావు బి. ఏ. సహకార దర్శకుడు : గురుదేవ్, నిర్మాతలు : రాజ్యం, శ్రీధరరావు, కెమెరా: రెహమాన్.

## ఆకాశరామన్న

యువరాజు అనంగపాలునికి కల్లబొల్లి మాటలు చెప్పి, చెడు మార్గం పట్టించారు దుష్ట చతుష్టయం వాచాలుడు, నరసింగరాయలు, కొత్వాలు, కామమంజరి. మత్తుగా తాగి వచ్చాడు యువరాజు. అతడిని ప్రేమించిన పడుచు బావ వాలకం చూసి గాభరాపడిపోతున్నది.

"దొరికితే దొంగలు, దొరక్కపోతే దొరలే ఏమంటావ్ హంసా !"

"బావా, ఏమిటిది? ఎక్కడ కెళ్ళావ్ ?" అడిగింది కళావతి కంగారుగా.

"ఎక్కడికా, కొత్త లోకానికి. మత్తుగా, గమ్మత్తుగా బలే బాగుందిలే ! అక్కడేం ఇక్కడిలాగ మాయలూ, మోసాలూ లేవు. భేదం, ఖేదం లేనే లేవు. నువ్వు వస్తావా హంసా ?" అడిగాడు అనంగపాలుడు.

ఆ స్థితిలో బావను చూసి కళావతి హృదయం బాధతో మూలిగింది. దిగులు ఆవరించుకుంటున్నది. అవమాన భారంతో కుంగిపోయింది. "బావా, ఆదర్శపురుషుడవని పొంగిపోయాను. ఇంతలోనే నువ్వింత హీనస్థితికి దిగజారిపోతావని కల్లో కూడ అనుకోలేదు. మధుపానం నేరం అని నీకు తెలీదా బావా !" దీనంతో అతని కన్నుల్లోకి చూస్తూ అడిగింది.

అనంగపాలుడు ఉలిక్కిపడి "ఎవరన్నారు ? అది ఏమిటనుకున్నావ్ ? అమృతం. దీనికోసమే ఆనాడు దేవతలు, రాక్షసులు తన్నుకు చచ్చారు. ఈనాడు చస్తున్నారు." చెప్పాడు.

"అనంగా !" పిలిచాడు, గోపాలకృష్ణరాయలు.

యువరాజు అటుకేసి చూసి "ఓహో, మామగారా ! రండి, దయచేయండి !" వ్యంగ్యధోరణిలో అంటూ ఆహ్వానించాడు.

"ఏమిటి నాయనా, ఇదంతా ?"

"ఏముంది, రాజనీతి నేర్చుకుంటున్నాం. రాజనీతి...

'నీ కళ్ళూ, చెవులూ కూడ నిన్ను మోసం చేస్తాయి. అందుచేత నిన్ను నువ్వే నమ్మకు' అన్నాడు వాచాలుడు. చూశారా ! మీరు రెండు సంవత్సరాలు నేర్చుకోమన్న రాజనీతి, రెండే రెండు ఘడియల్లో చెప్పేశాడు."

బావను యీ స్థితికి దిగజార్చిన వాచాలుని ఏం చేసినా పాపం లేదనుకున్నది కళావతి. అందుకే తండ్రితో "నాన్నా ! వెంటనే ఆ వాచాలుని బంధించి, వాడికి తగిన శిక్ష విధించండి" అన్నది.

అనంగపాలునికి కోపం వచ్చింది. "హాఁ ! శిక్ష



'తేనెమనసులు'లో రాంమోహన్, సుకన్య.



'ప్రేమించిచూడు' లో కాంచన, జగ్గయ్య.



'సింహాచలక్షేత్రమహిమ' లో గిరిజ.

## చిత్రలహరి

విధించడానికి మీకేం అధికారం ఉంది. వాడు నా స్నేహితుడు. అంతేకాదు, గురువు" అన్నాడు.

గోపాలకృష్ణరాయలు నిరాశ చెందాడు. "ఆఁ అప్పుడే ఆ దుష్టగ్రహాలకు లొంగిపోయావన్న మాట!" అడిగాడు.

"నాకు గ్రహబలం బాగాలేదని మీరే చెప్పారుగా! ఎక్కడో ఉన్న గ్రహాల్ని చూడడం ఎందుకోయ్ వెర్రివాడా! ఇక్కడే ఉన్నాయ్ కొన్ని గ్రహాలు. అవి రాజ్యాల్ని దోచుకుంటాయి. విధుల్ని దాచుకుంటాయి. ఏం మామా, నిజమేనా! మన రాజ్యంలో విధి ఉండటగా?"

"లేదని ఎవరన్నారు?" ఎదురు ప్రశ్నించాడు రాయలు.

"మరి నాకు చెప్పలేదేం! అందుకే మీరు అమృతం తాగరు. ఎందుకంటే అది నిజం చెప్పిస్తుందని భయం" నవ్వాడు అనంగపాలుడు.

"ఆ దుర్మార్గుల మాటలు విని నన్ను అనవసరంగా అపార్థం చేసుకుంటున్నావ్. రేపే సర్వం నీ కప్పగిస్తాను" రాయలు పౌరుషంగా పలికాడు.

"పిచ్చోడు. మా లోకంలో రేపు అన్నదే లేదు. అంతా యిప్పుడు తేలిపోవలసిందే! ఇవాళ నుంచి మనమే మహారాజులం! ఇప్పుడే మన పట్టాభిషేకం!" ఆజ్ఞ జారీ చేశాడు అనంగుడు.

"అలాగే ఏర్పాటు చేయిస్తాను."

"మీరేం చేయించ నక్కరలేదు. మాకు మేమే చేసుకొంటాం." అంటూ అనంగపాలుడు ముందుకు కదిలాడు.

కళావతి భీతితో "నాన్నా!" అన్నది.

"పరిస్థితి మించిపోయిందమ్మా!" అన్నాడు రాయలు.

ఈ సన్నివేశం గౌరీ ప్రొడక్షన్సువారి "ఆకాశరామన్న" చిత్రం లోనిది. కళావతిగా ఎల్. విజయలక్ష్మి, అనంగపాలునిగా రామకృష్ణ, గోపాలకృష్ణరాయలుగా ప్రభాకరరెడ్డి నటించారు.

గోల్డెన్ స్టూడియోలో త్వరితగతిని నిర్మించబడుతున్న యీ చిత్రానికి రచన: వీటూరి, సంగీతం: కోదండపాణి, కెమెరా: వేణు, దర్శకత్వం జి. విశ్వనాథం, నిర్వహణ: ఎస్. భావనారాయణ.

## చంద్రహాస

విషయ అమాయకత్వానికి మందహాసం చేశాడు చంద్రహాస, ఆమె కన్నుల్లోకి చూస్తూ "ఎందుకు లేదు? నీవంటి అపురూప సౌందర్యవతి నాకు దక్కితే నా జన్మ ధన్యమవుతుంది" అన్నాడు.

విషయ హృదయం ఆనందంతో రెక రెక కొట్టుకున్నది. "అయితే యిక్కడుండటానికి వచ్చేస్తావేం? యిదుగో నా నాటవిను! నువ్వు నాదగ్గరే వుండిపో? నీకు భోజనం నేనే స్వయంగా పెడతాను. నేనే నీ సేవచేస్తాను. నీకు ఏం కావలిసినా తెచ్చి పెడతాను. అన్నది ప్రియుని కన్నుల్లో ఏదో వెతుకుతూ.

ఇంతలో సుగుణ వచ్చింది. విషయ పక్కనున్న మగరాయుణ్ణి చూసి కంగారుపడ్డది "ఎవడు వీడు, దుర్మార్గుడా?" అడిగింది.

సుగుణను చూడగానే చంద్రహాసలో ఆశ్చర్యం అలుముకున్నది. ఆనందం పెనవేసుకున్నది. "సు...గు...ణా!" అన్నాడు మెల్లగా అతడి చనువు

చూట అటుంచి, అతని మెడలో కనిపించిన సాలి(గ్రాం చూసి ఆశ్చర్యపడుతూ "యిదేమిటి?" అని అడిగింది;

"సాలి(గ్రామంతో కట్టిన రక్షరేఖ" సమాధానిం చాడు చం(ద.

అతనెవరో యిప్పుడు అర్థమయినది సుగుణకు. "చం(దహాసా, బాబా నవ్వేనా?"

"సుగుణా ఎన్నాళ్ళకు కనిపించావమ్మా!" అన్నాడు విస్ఫారిత నే(త్రాలతో ఎరికించుతూ.

ఆమె కళ్ళనిండా నీళ్ళు నిండుకున్నవి "ఏం చెయ్యను నాయనా! నిన్ను సంహారించామన్నారు, నవు చనిపోయావన్నారు. నాటినుంచి ఆ దుఃఖం తోనే నేను కృంగిపోయాను. శ(త్రువులకు లొంగి పోయాను. ఇప్పుడు నిన్ను చూడగానే చం(ద్రోదయ మయినట్టు నా (ప్రాణాలు లేచివచ్చాయి" అన్నది సుగుణ.

విషయ తెల్లబోయినది. పొక యీర్ష్యారేఖ ఆమెను ఆవహించుకొన్నది. తన (ప్రియుడు ఆమెకు లొంగిపోతున్నాడేమోననే అనుమానం విషయను కృంగదీసినది. అందుకే "ఏమిటిది? చం(దహాసా, నీవు యీమెను కూడా (ప్రేమిస్తున్నావా? ...వీల్లేదు ...నేను సహించను!" అన్నది.

చం(దహాస నవ్వి "విషయా, నేను నిన్ను తప్ప ఎవర్నీ (ప్రేమించను! (ప్రేమించను!" అన్నాడు భరోసాయిస్తూ.

"మరయితే సుగుణతో..." అంటూ ఆగిపోయి నది, అమాయకంగా చూస్తూ విషయ.

"వె(రిదానా. సుగుణ నన్ను పెంచినతల్లి!"

"చం(దహాసుడు నా బిడ్డడమ్మా" చెప్పింది సుగుణ.

"ఓహో, అదా!" అన్నది కన్నులెరేస్తూ తేలిక పడిన మనసుతో విషయ.

"యింక నేను వెళ్ళివస్తాను" అన్నాడు చం(ద బయలుదేరుతూ.

విషయ "ఆ, నన్నువిడిచి వెళ్ళిపోతావా, చం(ద హాసా?" అడిగింది దీనంగా.

"నీకు తెలియదు విషయా, నేను యింకా అక్కు ఉంటే (ప్రమాదం" చెప్పాడు చం(దహాస.

"వెదకండి! మీ రందరూ నలుమూలలా గాలిం చండి!" అక్కడికి అనతిదూరంలో ఎవరో అంటు న్న యీ మాటలు, కంగారుగా తిరుగుతున్న సవ్వడి వినిపిస్తున్నది.

"అదుగో ఎవరో వస్తున్నట్టున్నారు సుగుణా! మనం ఆ శివాలయంలో వున్నాం. మన గణపతి కూడా అక్కడే వున్నాడు. చూదువుగానిరా!... విషయా, వెళ్ళొస్తాను!" అంటూ చం(దహాస అక్కణ్ణించి బయటకు పరుగెత్తాడు, అతనిని అను సరిస్తూ "చం(దహాసా!" అంటూ స్పృహ తాలయి పోయినది విషయ,

ఆ సక్తిని రేకెత్తించే యీ సన్నివేశం వి(క్రమ్ (ప్రొడక్షన్స్‌వారి "చం(దహాస" చి(త్రంలోనిది. వి(క్రమ్ స్టూడియోలో శరవేగంతో నిర్మించబడు తున్న యీ చి(త్రానికి నిర్మాత, దర్శకుడు, బి. యస్. రంగా. అసోసియేట్ డైరెక్టర్స్, టి. దయా సాగర్, కె. ధర్మరాజ్, సంగీతం యస్. హనుమంత రావు.

—మోహన్ కుమార్ ★



కాశీ విశ్వనాథుని సందర్శించగానే కష్టాలన్నీ మరచిపోయి భక్తిపారవశ్యంతో
"నమో భూతనాథ నమో భక్తపాల నమో దేవదేవ" అని హరిశ్చంద్రుడు ఈశ్వర స్తోత్రం చేయుట.

# ORWO
# ROLL FILM

ఓర్వో రోల్ ఫిల్మ్-రంగుల్లో మరియు బ్లాక్ అండ్ వైట్




40 యేండ్ల నుంచీ యీ ఫోటో ఫిల్మ్ మీరెరిగినదీ, వాడుతూ వచ్చినదీనూ. ఇప్పుడది వ్యాపారరీత్యా మరో క్రొత్త పేరుతో వస్తున్నది. "ఓర్వో"–అంటే ఒరిజినల్ వుల్ఫెన్ అనే పేరుకు సంగ్రహ రూపం. ఓర్వో ఫోటో ఫిల్మ్, యీనాడు ఐరోపాలోకంతటికీ పెద్ద ఫిల్మ్ ఉత్పత్తి సంస్థ అయిన విఇబి ఫిల్మ్ ఫాబ్రిక్ వుల్ఫెన్ వారిచే తయారుచేయబడుతున్నది. 55 ఏండ్లకు పైగా అతి నాణ్యమైన శీఘ్ర గ్రాహక ఫోటో సామగ్రిని తయారు చేస్తున్న సంస్థ యిదేనని మీకు బాగా తెలిసిన విషయమే.

**VEB FILMFABRIK WOLFEN**
German Democratic Republic




ఓర్వో ఫిల్మ్స్ ఈస్టర్న్ యూనిట్
మద్రాసు-2 ■ కలకత్తా-13

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6&7 Thambuchetty Street, Madras-1. Phone: 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



"సింహాచలక్షేత్రమహిమ"లో కాంతారావు, కృష్ణకుమారి

